# రా మ రా యు లు

అంతటి నరసింహం ఎం. ఏ.,
(ప్రభుత్వకళాశాల, రాజమండ్రి.)

పబ్లిషర్సు
రాయలసీమ కృష్ణరాయ పబ్లిషింగ్ వర్క్సు
అనంతపురం

నను బాల్యమ్మున నుండి యాఁధ్రకవితా నానాగతుల్ శ్రద్ధతోఁ
గనఁ బ్రోత్సాహ మొనర్చుచున్ నిశలలోఁ గావ్యాలనెంతోపఠిం
పనిదే నిద్రకుఁబంపనొల్లని మహాభవ్యాత్ము శ్రీ పెంచలా
ర్యునకుందండ్రికి నిత్తుమత్కృతిని ధన్యుఁగాఁగ నూహించుచున్.

# అ భి ప్రా య ము లు

"ప్రతి తెలుగువాడూ చదవదగ్గ రచన. గ్రంథాలయములో వుండదగినది. విద్యార్థుల కుపవాచకముగా యుపయోగించిన చాల మంచిది. శైలి మనోహరముగ నున్నది."

ఆంధ్రప్రభ 6—4—'58

"శైలి బాగున్నది."

ఆంధ్రపత్రిక 11—5—'58

* * * * * *

ఈ కాలమునందలి సంఘసంస్కరణాది నవీనగుణములను రామరాయలయందు రచయిత ఆరోపించినాడనియు అది అంత సమంజసముగ లేదనియు, కొందఱుభావించి పొరపడినారు. వారు చరిత్ర సత్యములను మఱచియే యట్లన్నారు. సంస్కరణకు సంబంధించిన భావములు కేవలము నేటి వేఅనుకొనుట పొరపాటు. అట్లగుచో బుద్ధుడును, తరువాతి బౌద్ధపండితులును, ఆ తరువాతి వారగు కబీరు, ఇత్యాదులును ఈనాటివారు కావలసియున్నది. సంస్కరణ అన్నది ఒకనాటికి సంబంధించినదిగాదు. సమాజమునకు సంస్కరణ నిత్యావసరము. ప్రాణికి నిత్యము ఆహారమెంత యవసరమో సంఘమునకు సంస్కరణ నిత్యావసరము.

ర చ యి త

———

# ఒకనాఁడు

ఒకనాఁడు మనజాతి– కత్తి పట్టి కదనాలు సలిపి– ఖండ ఖండాంతరాలలో ధ్వజకాంతి విరజిమ్మి – శౌర్యమును చాటినది.

ఒకనాఁడు మనజాతి– స్వపరిపాలనకు, సుపరిపాలనకు– స్వేచ్ఛకు, స్వీయప్రకాశతకు– అభ్యుదయమునకు, ఔన్నత్యమునకు–పునికిపట్టయి మనినది;

ఒకనాఁడు మనజాతి– సర్వమతాలగమ్యము సర్వమయుఁడని– సర్వజీవకారుణ్యమే మతమని– సత్యాహింసలే పరమ ధర్మాలని– పాటించి– దేశదేశాలలో బోధించి– తన మతోదార సుగుణత్వమును ప్రపంచమంతయు విరజిమ్మినది;

ఒకనాఁడు మనజాతి– తీయని ద్రవిడమునకు సంగీత యుక్తమయిన సంస్కృతమును జోడించి– ఒక విశిష్టమైన సంశ్లిష్టభాషను పెంపొందించి– కలముఁబట్టి కావ్యాలువ్రాసి– మృదుమధురరావాత్మకమైన ఆంధ్రభాషను వెలయించి "దేశ భాషలందు తెలుఁగు లెస్స" యని చాటినది;

ఆనాటి తెనుఁగుతన మీనాటికిని తేటగనె యున్నది;
ఆనాటి చేవ యీనాటికిని చైతన్యసహితమై యున్నది;
అప్పటివలె విజృంభణమే మన కీనాడు కావలసి యున్నది;
లెండు, లెండు; నడుములు బిగింపుఁడు; ముందునకుఁ నడుఁడు.

---

# ఒక మాట

విజయనగరాంధ్రరాజవంశజులలో - శౌర్యస్థైర్యములందును - సాహస సౌదార్యములందును - విద్యావిజ్ఞానములందును - కళాపోషణాది విషయములందును - శ్రీకృష్ణదేవరాయమహారాయల యనంతర మంతటివాఁడు రామరాయలే! ఇతఁడు, బుద్ధ - జిన - క్రీస్త్వాదుల సత్యసమ్మతమైన యహింసాసత్యములయం దాసక్తి గలవాఁడు.

ఇతఁడు సంఘసంస్కర్త. కావుననే చాకలి కన్నెను వివాహమాడి సమత్వమునకు దారి చూపినాఁడు. నీచవృత్తుల యందున్న వారి నుద్ధరించి వృత్తి గౌరవమును పునఃప్రతిష్ఠించినాఁడు.

మన దేశచరిత్ర యసంగతములతోఁ గూడికొని యున్నది. విజయనగర చరిత్రమునకుఁ బ్రమాణము ఫెరిస్తా అను మహమ్మదీయచరిత్రకారుడు. ఈతఁడు రామరాయల సమకాలీనుఁడు. బీజాపురసుల్తాను దగ్గఱ నుండినవాఁడు. వీని నాధారముగఁ జేసికొని, యతని మాటల నుల్లేఖించుచు, పాశ్చాత్త్యులు విజయనగర చరిత్రను వ్రాసినారు. నిజమైన చరిత్రకారులగు కవుల వ్రాతలను అతిశయోక్తులని త్రోసిపుచ్చినారు. అందువలన రామరాయలు దురాశాపరుఁడుగను - నిలుకడ లేనివాఁడుగను - ఇంకను నేమేమొగను, చిత్రింపఁ బడినాఁడు. కాని, రామరాయలు సర్వాత్ముఁడు, ఉదాత్తుఁడు, ఉన్నతుఁడు, ఉత్తముఁడు.

పిల్లలు చదువునపుడు అర్థావగతికి భంగము వాటిల్లునన్న భయముచే ఈ కొన్ని చోట్ల విసంధి చేసితిని, అరసున్నలఁ బరిహరించితిని, శకటరేఫమును విసర్జించితిని.

ఈ గ్రంథమును రచించుటలో నితర చారిత్రక గ్రంథముల కంటె నెక్కువగఁ దోడ్పడిన విమర్శనాగ్రంథమగు "అళియ రామరాయలు" ను రచించిన స్వర్గీయులు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారికి కృతజ్ఞతాభివందనము లర్పింప వలసియున్నది.

"రచయిత"

# 1

శారదసుధాంశుఁడు తన కిరణజాలముచే నమృతమును గురియించుచున్నాఁడు. ప్రకృతియంతయు తన్మయత్వము ననుభవించుచున్నది. సూదులతో పొడుచుచున్నట్లు చలిగాలి తాకుడు తాకుచున్నను, అలసి సొలసిన వీరభటులు సైనికశిబిరాలలో నిశ్చింతగ నిద్రపోవుచున్నారు. ఘనమై, సుందరమై, వైలక్షణ్యయుతమైన రాజశిబిరమున పరరాజభయంకరుఁడు శ్రీకృష్ణదేవరాయప్రభుఁడు మేల్కాంచియే యున్నాఁడు. ఈ నాఁడా చంద్రుఁడు గూడ నాతని ముఖమున బంధితుఁడై యున్నాఁడా యన్నట్లుగ ముఖకాంతితో విరాజిల్లుచున్నాఁడు. తృప్తిగ మందహాసము గావించుచు "చూచితివా అప్పాజీ! నీ ధైర్యసాహసములను, నీ బుద్ధిబలమును మించిన సాహస ప్రజ్ఞల ప్రదర్శించి మనల విజయవంతుల జేసినాఁడా యువకుఁడు! అతని యుద్ధరీతిని, సేనానాయకత్వమును, మొదటినుండియు పరికించుచునే యున్నవాఁడను. ఏనాటి కానాఁడు నన్నాశ్చర్యచకితుని గావించుచుండెడివి! నేఁటి కతని వల్లనే మనకీ యుదయగిరి దుర్గమున విజయశ్రీ లభించినది." అనెను. ఆ మెచ్చుకోలు విని అంతకు ముందే మెప్పుదలతో నింపియుంచిన తన హృదయము ఉబ్బగా, "మహాప్రభూ! నీ వన్నది ముమ్మాటికి సత్యము. నా మనోవీథికిగూడ గోచరముగాని విషయము లందెన్నిటియందో అతఁడు విశదపరిచెనో

వైరులు పన్నెడి వ్యూహములకు సరిగా ప్రతివ్యూహముల పన్నగల దక్షత ఆయువకుని కొక్కనికేగలదు. అతనికి..." అని తిమ్మరుసుమంత్రి, వాక్యమును పూర్తి చేయకమునుపే అడ్డువచ్చి "అతనికి గొప్ప బహుమాన మీయవలయును." అని ఆనందముతో ఉక్కిరిబిక్కిరగుచున్న శ్రీ కృష్ణదేవ రాయలు సాభిప్రాయముగ ననెను.

"నేనును అదే అనుచుంటిని. అంతలో నీవందుకొంటివి. బహుమానమీయ బడేగాదు. అది అపూర్వమైనదిగ నుండ వలయును."

"అపూర్వమైన దేమున్నది?"

"నీమనసులో నున్నదదియే!"

"అది అపూర్వమెట్లగును? అందరాచరించిన మార్గము ననే నేనాచరించుచున్నాను"

"కాదు ప్రభూ! రాజాధిరాజ రాజపరమేశుడు శ్రీకృష్ణ దేవరాయమహారాయల పుత్రికారత్నము తిరుమలాంబికను బహుమానముగ పొందుట సామాన్యవీరుల కలవియెట్లగును?"

రాయలామాటవిని మందహాసము గావించినాడు. అంత కంతకును దృష్టిని అంతర్ముఖము గావించినాడు. తిరుమలాంబి కనేగాదు! ఆత్మపాలితమగు యావద్దక్షిణ దేశమాతనికి అరణ ముగ నిచ్చినను అపూర్వబహుమానము గాదని యాతనికి దోచినది. ఎంతటి శౌర్యవంతుడా యువకుడు! చండప్రచండు లైన వైరివీరుల [illegible] చాళుక్యమార్తాండుని

పటు దుర్నిరీక్ష్యమైనావు! అరివీర హరిణసముదాయమునకు సింహమైనావు! దుర్భేద్యమైన ఉదయగిరి భేదనమునకు వజ్రాయుధమైనావు!!

## 2

శ్రీమన్మహామండలేశ్వర శ్రీకృష్ణదేవరాయ ప్రభువు పూర్వదిగ్విజయ యాత్ర బయలుదేరి యీపాటికి మూడు మాసాలయినది. చేర, చోళ, పాండ్యాది సకల సామంతులును, తమ తమసైన్యాలతో తోడుపడవచ్చిరి. నాగమనేడు పిరమనేడు మొదలుగాగల యోధానయోధులు తమ తమబలములతో రాయల బలముల చేరిరి. బుక్కరాయ రామరాజపుత్రుడు శ్రీరంగరాజు తన సోదర సుతాదులతో సహాయుడై వచ్చినాడు. తొలుదొల్త వీరి దండయాత్రకు గురియైనది ఉదయగిరి దుర్గమే! దక్షిణ దిగ్విజయములో నాటి తేటిన కతమున మద గర్వితులైన రాయల సైనికులు ఉదయగిరి నవలీలగ చుట్టుముట్టి తుదముట్టింపగలమని తలంచిరి. కాని ఆ ముట్టడి ముట్టడి మూడు మాసాలు సాగినది.

ఆరితేరిన రాయల సైన్యము హోరాహోరిగ పోరాడినది. పరసైన్యముల నెన్నిసారులో పరుగులెత్తించినది. అయినను దుర్గము మాత్రము హస్తగతముగాలేదు. అది ప్రకృతిసిద్ధమైన దుర్గము. అందులకే అల్పసంఖ్యాక సైన్యము సహితము రాయల సైన్యము నెదిరింపగలిగినది. సంఖ్యాబలమును

నీలా గొప్పదైన సైన్యము దిగ్బంధన గావించినది, అనేక పదార్థాల సరఫరా నాటంకపఱచినది. దానికి తోడు భేదోపాయమును పన్ని వైరివీరులు వశమగునట్లు గావించినది. ఈజయమునకు కారణభూతుడు శ్రీరంగరాజసుతుడు రామరాజే!

ఇదే యదనని గోల్కొండప్రభువు ఎనలేని సైన్యముతో కందనోలును ముట్టడించెను. తండ్రి శ్రీరంగదేవరాయలయాజ్ఞచే రామరాయలు కందనోలున కేగెను. అనంతరము రాయల సైన్యము కొండవీడున కసవాపాత్రుని తునుమాడి తద్దుర్గమును స్వాధీనపఱచుకొని, తర్వాత జమ్మిలోయ, వేంగి, కోనసీమ, ఒడ్డాడి, మాడుగుల, సింహాచలము మొదలగు దుర్గముల జయించి, జయస్తంభముల నాటి, కటకపురిని దహించి యట జయస్తంభమును నాటి, అప్పటికి పూర్వదిగ్విజయమును చాలించి వెనుకకు మరలినది.

## 3

పదునాల్గవ శతాబ్దము ముసల్మానులకు మనికిపట్టు. అంతకుముందు ఉత్తరభారతము నాక్రమించిన తురుష్కులు దక్షిణదేశము పైకిగూడ విరివిగ దండయాత్రలు సాగింప మొదలిడినారు. అంతకుముందే ఖిల్జీవంశస్థుడగు అల్లాయుద్దీను దేశమును కొల్లగొట్టినాడు. అనంతరము ఢిల్లీసింహాసన మెక్కిన మహమ్మద్ బిన్ తుఘ్లక్ ఎనలేని సైనికసంఖ్యతో

దేశముపై పడి అల్లకల్లోలము కావించినారు. ఎన్నియో జనపదములు నిర్జనములైనవి. అసంఖ్యాక దేవాలయములు కొల్లగొట్టబడినవి. ఎందరో బలవంతముగ అన్య మతావలంబులయిరి. దేవగిరి రాజధానిగ గల మహారాష్ట్రసామ్రాజ్యము తురుష్కుల పాల్పడినది. ఓరుగల్లు రాజధానిగా గల కాకతీయ సామ్రాజ్యము ఛిన్నభిన్నమైనది. ద్వారసముద్రము రాజధానిగా గల కర్ణాట సామ్రాజ్యము విచ్ఛిన్నమై పోయినది. ఇట్టి పతనమునకు హిందూమతములోని భిన్నతగూడ ఒక కారణము కాకపోలేదు. పాలకుల స్వాతంత్ర్యేచ్ఛయును, పరరాజ నిరసనమును, పరస్పర వైరమును గూడ కారణములు కాకపోలేవు. ఈ దెబ్బతో హిందూరాజులు తమ లోపమును తెలిసికొనిరి. అందఱును ఏకీభవించి శత్రువుల పారద్రోలిన గాని తమరాజ్యములకును, మతమునకును క్షేమాభద్రతలు లభింపవని తలంచిరి. ఏకీకరణ శక్తికొఱకై అన్వేషించుచు నిరీక్షించుచుండిరి. ఈ ప్రయత్నముల ప్రతిఫలమే విజయనగర ప్రతిష్ఠాపనము.

పన్నెండవ శతాబ్దాంతమున ఆనెగొందిని పాలించుచుండిన చాళుక్యరాజపుత్రుడు విజయధ్వజుడను పరాక్రమశాలి ఉత్తుంగ భద్ర తుంగభద్రానదీతీరమున విజయనగరమను పట్టణమును తనపేర నిర్మించినాడు. దానినే విద్యారణ్యస్వామి ప్రోత్సాహమున హరిహరరాయ లతివిశాలము గావించి, విద్యానగరమను నామాంతరమున ప్రఖ్యాతికి దెచ్చినాడు.

తరువాతి రాజులు పరాక్రమశాలురై చుట్టుపట్లగల రాజ్యముల లొంచుకొని తత్పాలకుల సామంతుల గావించుకొన్నారు.

కల్యాణనగర మొక ప్రసిద్ధికెక్కిన రాజ్యమునకు ముఖ్యపట్టణము. దీనిని పాలించిన చంద్రవంశపు రాజులు అరిరాజ భయంకరులు. ప్రక్కనున్న హొయసల రాజ్యమునకును, కంపిలి రాజ్యమునకును. ప్రక్కలోని బల్లెములు, ఈ వంశమునకు మూలపురుషునిగ చెప్పదగినవాడు వీరహొమ్మాళిరాయడు. అతనికి బొమ్మరాజను నామాంతరము గలదు. ఈతని మనుమడు రాఘవరాజు కంపిలిరాయ సైన్యముల గెలిచి "గండరగూళి" యను బిరుదమును వహించి, కొట్టగల్లు నగరమునకు పాలకుడై 'కొట్టగంటి' రాఘవరాజ'ని పిలువబడినాడు. ఇతని సవతిసోదరుడు "సోమదేవరాజు" ఆహవమల్లుడు. రణరంగ సాహసుడు. మహమ్మదీన్ బిన్ తుగ్లక్ కల్యాణపురముపై దండెత్తి వచ్చినప్పుడు ఘోరస గ్రామము నలిపి. పలుమారు యుద్ధములలో నోడించినాడు. అతనిని చెఱబట్టి తనకు పుట్టినకొడుకునకు సోమదేవరాజని పేరుపెట్టుకొని నవనని వేడుకొనగా విడిచి పెట్టినాడు. మాళవ రాజ్యముపై దండెత్తి, తద్భూపు సామంతు నోడించి, "మాళవరాజేంద్ర మస్తకశూల" యని బిరుదందినాడు యుద్ధములందారితేరిన యోధుడును, వైరిరాజ భయంకరుడును, ఆయి "సాహసబిరుదరగండ" యను బిరుదందినాడు. విద్యానగర సామ్రాజ్యమును స్థాపించి పెంపొందించిన మనుష్యు పాలించిన హరిహరరాయలవారు నితడు, [illegible]

సామ్రాజ్యమును స్థాపింప యత్నించినాడు. తుంగభద్రకు ఉత్తరమున గల రాజ్యమున కంపటికిని సర్వాధికారి యయినాడు. ఇతడు సప్తదుర్గాధిపతి. "ఏకదివస ఘటికైక ఖాటీ హఠావృతకోట రాచూరు సాతానికోట కందనవోలు యాతగిరి కలువకోల్లు మొసలిమడుగు గంగినేనికొండాభిధాన సప్త దుర్గవర్తి."

ఈ అడపెర భయంకరు డస్తమించిన వెనుక నితని కుమారుడు రాఘవరాజు రాజ్యమునకు వచ్చినాడు. ఉత్తరమున బహమనీసుల్తానులు విజృంభించు చుండిరి. దక్షిణమున విజయనగరాధిపులు విజృంభించుచుండిరి. వీరిరువురితో పోరుచు రాఘవరాజు మరణించినాడు.

లక్ష్మీ సంబంధమైన దేశము నిలుకడగ నుండజాలదు. అట్లే రాజ్యరమగూడ. మొన్నటివరకు సోమదేవరాజు తన మాట కెదురాటలేక నిరాటంకముగ నధికారము చలాయించినాడు. నిన్నటివరకు రాఘవరాజు స్వాతంత్ర్యకాంక్షచే విజయనగర బహమనీ రాజ్యములతో పోరాడుచు తనవ్యక్తిత్వమును నిలుపుకొన్నాడు. నేడు పిన్నభూపాలుడు చిన్నతనమైనను లేక కర్ణాటసామ్రాజ్యాధీశుడు దేవరాయమహారాయలకు సామంతుడైనాడు. 'ఆరవీడు'ను రాజధానిగా గలిగి, అస్వతంత్రుడై కాలము గడిపినాడు.

ఈతని గర్భమున జనించినవాడు బుక్కభూపాలచంద్రుడు. ఆగమీతని బుక్కరాజు అరిరాజుల సమూహములతో

ప్రక్కబల్లె మైనాడు. పరిసరప్రాంత పాలకులనెడు సత్రుక్షత్రియము లకు రాకా నిశాకరు డైనాడు. చంద్రగిరిపాలకుడైన సాళువ నరసింహరాయల కితడు పరమ మిత్రుడు. కర్ణాటక సామ్రాజ్యమున సామంతుడైన సాళువ నరసింహరాయలు తత్పరి పాలకులు బలహీనులు కాగా స్వతంత్రించి సామ్రాజ్యము నంతటిని ఆక్రమించినాడు. ఆతని ప్రతి ప్రయత్నమందును ఆర వీటి బుక్కరాజు సాయపడినాడు. అందుచేతనే "సాళువ నర సింహరాయ రాజ్యప్రతిష్ఠాపనాచార్య" అను బిరుదమును పొందినాడు. తన పలుకుబడి తిరుగులేనిదిగా నున్న యా యార్వీటి బుక్కరాజు తన తనయుడైన రామరాజును కంద నోలు పట్టణమున కధిపతిని చేసినాడు. ఆసమయముననే బీజా పుర సుల్తానగు ఆలీఆదిల్‌షా అనంత సైన్య సాగరముతో కందనోలును ముట్టడించి నపుడు రామరాజు అవలీలగ పోరాడి సైన్యమును తునుమాడెను. ఆదవాని దుర్గమును జయించి రెండవ కొడుకు కొండ్రాజును దానికధిపతిని చేసెను. ప్రథమ పుత్రుడైన తిమ్మరాజును అవుకునకు పట్టము గట్టెను. కడపటి పుత్రుడు శ్రీరంగరాజును కందనోలునకు యువరాజును చేసెను.

అవుకు తిమ్మరాజు నలువది సంవత్సరములు విజయ నగర రాజుల పక్షాన యుద్ధాలలో పాల్గొన్నాడు. ఇతడు యోధుడేగాక గొప్ప మహాత్మ్యము గలవాడు. ఒకప్పుడు తిరుపతి వెంకటేశ్వరస్వామి ఒక అంధగోపకునికి కరుణించి

బొటుక కన్ను మాత్రమిచ్చి, తిమ్మరాజు స్వప్నమందు [illegible] మిగిలిన కన్ను నీకిమ్మన్నాడట! అంత నాతిమ్మనృపతి గోపకు నికి చూపొసగినాడు. ఒకనాడు దండుతో మండువేసవిన ప్రయాణము గావించి నపుడు సైనికులెల్లరు దప్పిజెంది రాజు నకు మొఱపెట్టగా నాతం డాత్మ శుద్ధితో కొంతసేపు విష్ణు వును ప్రార్థించినాడు. ఆశ్చర్యమును గొలుపునట్లుగ వారుండు కొండ నెత్తమ్మున నొక్క నీటిబుగ్గ జనించినది! ఎల్లరు దప్పి తీర్చుకొనగానే అది మాయమైనది.

ఇట్టి మాహాత్మ్యము గల తిమ్మరాజు ఒకవైపు మహ మ్మదీయులతో పోరి జయమును గొనుచు, మరియొకవైపు ఎత్తి వచ్చిన కళింగాధీసు డగు ఒడ్డెరాయని గూడ జయించి నాడు. శ్రీకృష్ణదేవరాయల పట్టాభిషేకమున పాల్గొన్నాడు. శ్రీవారి జైత్రయాత్రలలోపాల్గొని ప్రాముఖ్యమును వహించి నాడు.

ఈ విధముగ నార్వీటి బుక్కరాయ వంశము విజయ నగర రాజుల కండగ నుండుచు, పరిసర ప్రాంతములం దం తట తమ యాధిపత్యమును వెలయించిరి. నంద్యాల, కంద నోలు, ఆదవాని, అవుకు, గుత్తి, గండికోట, మొదలగు స్థల ములయం దంతయు వీరి వంశమువారే! ఈ తిమ్మరాయ కనిష్ఠసోదరుడు శ్రీరంగ దేవరాయలు. శ్రీకృష్ణదేవరాయ మహారాయలకు ప్రీతిపాత్రుడు. ఈయనకు కోనరాజు, తిమ్మ రాజు, రామరాజు, తిరుమలరాజు, వెంకటపతిరాజు అను

ఐదుగురు కుమారులు గలరు. అందలిమూఁడవ సంతానమగు రామరాజే ఉదయగిరి దుర్గమును భేదించి శ్రీకృష్ణదేవరాయల మన్ననలకు పాత్రుడైనవాడు.

## 4

వసంతకాలము ప్రకృతిలలామకు ఒక యలంకరణము. ప్రకృతిజన్యమయిన దంతయు, శోభాయమానమై ఆహ్లాద జనకముగ నుండును. ప్రాణికోటియంతయు నారోగ్యముగ నుండును. పాలకులును, యోధులును, దండయాత్రలు ముగించి విశ్రాంతి గైకొను చుందురు. రైతులెల్లరును, ధాన్యములను గాదెలకు పోసికొని ఐశ్వర్యముల ననుభవింపు చుందురు. వినోదార్థము వసంతోత్సవముల నోలలాడుచుందురు.

విజయనగరమున వసంతోత్సవములకు తోడు విజయోత్సవములు గూడ సంభవించుచున్నవి. రాజాధిరాజు శ్రీకృష్ణదేవరాయమహారాయలు ఉత్తరదిగ్విజయయాత్ర జయావహముగ నెరవేర్చుకొని వచ్చినాడు. పురమంతయు విజయానందోదధిలో నోలలాడుచున్నది. పురద్వారము మొదలు రాయలవారి దర్బారువఱకు ఎత్తయిన పందిళ్ళు వేయబడినవి. పందిళ్ళపై పచ్చలు తాపిన దుప్పట్లు వేయబడినవి. క్రిందుపైపున ముత్యాల తోరణములు వ్రేలాడగట్టబడినవి. దారిపొడవునను రత్నకంబళ్ళు పఱుపబడినవి.

భువనవిజయ మనంతసుందరమై విరాజిల్లుచున్నది. ద్వారాంగణములు శోభాయమానమై దివ్యమనోజ్ఞప్రభలతో

ప్రాసాదములు కన్నుల మిరుమిట్లు గొల్పుచున్నవి. నేడు కొలువు దీరియున్న రాయలవారి ముఖమండల మానందాతిరేకముచే చంద్రికాప్రభలీనుచున్నది. ఏదో యొక యుద్దేశ్యముచే సిద్ధము చేయబడిన ఆకొలువునకు ఆహూతుడైన శ్రీరంగ దేవరాయలు రామరాజద్వితీయుడై దుందుభిధ్వానముల మధ్య ప్రవేశించి నాడు. కొలువుకూటమంతలి వారందరును లేచి నిలువంబడి నాడు. మహైశ్వర్యజనకముగ మహారాయలు శ్రీకృష్ణ దేవ రాయలు గూడ ఆసనమునుండి లేచినాడు. మందహాసముతో శ్రీరంగ దేవరాయ మహారాయుల ముఖమండల మవలోకించి నాడు. ఈనాటి వాతావరణము శ్రీరంగ దేవరాయల దిగ్భ్రాంతిలో ముంచి వైచినది. రాయలవారేల తమ యాసనము నుండి లేచిరో యాతని కర్థముగా లేదు. తన యాసనముగూడ ఈనాడెవ్వరిచేతనో యాక్రమింపబడినది. రాయలవారి సమీపస్థమై యొక యున్నతాసనము మాత్రము కనబడుచున్నది. ధీరోదాత్తుడు శ్రీరంగ దేవుడు నిశ్చలుడై నిలబడినాడు ఒక్క నిమిషముపాటాగిన భేరీనినాదము మరల చెలరేగినది. రాయల వారతిప్రసన్నముగ శ్రీరంగరాయుల వైపు చూచుచు ముందుకు నడిచినాడు. వచ్చి తన కరద్వయముతో నతని కరముల పుచ్చుకొని తోడ్కొని పోయి ఆయున్నతాసనమును సబహుమానముగ చూపినాడు. దాని ప్రక్కనున్న ఉచితాసనముపై కూర్చుండ రామరాయలకు సంజ్ఞ చేసినాడు. తాను తన ఆసనమును సమీపింపగనే భేరీనినాదము ముక్క-

సారిగ నాగిపోయినది. ఆ నిశ్శబ్దవాతావరణములో అంపిటి నుద్దేశించి, జలధరధ్వానసమానగంభీరధ్వనితో "నేటి నుండి, కందనోలు రాజ్యాధినేత శ్రీ శ్రీరంగ దేవరాయ మహారాయలుం గారు విజయనగర సామంతరాజులు కారు. సర్వతంత్రస్వతంత్ర సామ్రాట్టు" అని రాయలు ఆసీనులైనారు. అందఱు గూడ ఆసీనులైనారు. సభయంతయు ఆనందకోలాహలము గావించి నది. ఆ కోలాహల మధ్యమున మంత్రివరేణ్యుడు తిమ్మరుసు లేచినాడు. తృప్తిగ మందహాసము గావించుచు ధీర గంభీర స్వరముతో "సభాసదులారా! మరియొక ముఖ్యాంశ మున్నది. శ్రీమన్మహా మండలేశ్వర శ్రీ శ్రీ శ్రీకృష్ణదేవరాయ మహా రాయ ప్రభువంశమునకు పూర్వము నుండియు ఆర్వీటి వంశస్థులు పరమాప్తులు. శ్రీ రాయలవారు విజయనగర రాజ్యాధినేతలగు సమయమందును, దక్షిణ పూర్వ దిగ్విజయ యాత్రల సమయమందును, అత్యధికముగ తోడ్పడినవారు ఆర్వీటివంశజులు. వారందఱిలో రాయలవారి యాదరాభి మానముల చూరగొన్నవారు శ్రీశ్రీశ్రీ శ్రీరంగ దేవరాయమహా రాయలుంగారు. వారితృతీయపుత్రుడు చిరంజీవి ఈ రామరాయలు అన్ని దండయాత్రల యందును పాల్గొని అరివీరభయంకరుడని పేరుపొందినాడు. అవక్రపరాక్రమముచే ఉదయగిరి దుర్గమున వైరిబలమును తునుమాడినాడు. అశేషధీచాతుర్యముచే దుర్గమును స్వాధీనపఱచుకొని శ్రీకృష్ణదేవరాయల కొసగి నాడు. తరువాత కందనోలును ముట్టడించిన ఆదిల్ షాతో

హాోరాహోరిగ పోరాడి అశేషసేనావారమును నిశ్శేషము గావించినాడు. పరాక్రమశీలురలో పరాక్రమశాలియును, ధీమంతులలో ధీమంతుడును అయిన ఈ రామరాయలు శ్రీకృష్ణదేవరాయల ఆశ్చర్యానందములలో ముంచి తేల్చి నాడు. ఆయన ప్రేమాభిమానముల చూరగొన్నాడు. కృతజ్ఞతాభరితహృదయము తోడను, అభినందనసూచకముగను శ్రీవారీయుపకరత్నమునకు తన కన్యారత్నమైన తిరుమలాంబి కను కన్యాదానము చేయ నిశ్చయించినారు. నేటి కెనిమిదవ నాడు, వైశాఖశుద్ధ త్రయోదశినాడు వివాహము జరుగులాగున దైవజ్ఞులు నిర్ణయించినారు. నేటితో సభ ముగిసినది మరల దర్శన మేకాదశి నాడే!'' అని మంత్రి యుపన్యసించి విరమించెను. మరల నొక్కమారానందకోలాహలము జన సందోహమున సందడింపగా, మంగళతూర్య నిస్వనములు సభాంతరాళమున మ్రోగినవి. పటహ, భేరీ, ఢక్కా, కాహళ, దుందుభిధ్వానముల చే సభాంతరాళము పిక్కటిల్లినది.

## 5

ఏకాదశి యేతెంచినది. శరచ్చంద్రచంద్రికానిభధావళ్యముతో భూనభములు స్వచ్ఛములై వెలుగొందుచున్నవి. నాత్యుష్ణమైన మందవాయువులు మెల్లమెల్లగ వీచుచున్నవి. విజయనగర పరిసరప్రాంత ప్రకృతియంతయు, పరునాడు జరుగబోవు కల్యాణమహోత్సవానందమును నేడే పొందు

చున్నట్లు కన్పట్టుచున్నది. నభఃఫలకముపై వక్రరేఖలు గీయబడినవా యున్నట్లు విజయనగరప్రాంతపర్వతశ్రేణులు రమ్యదర్శనము నొసగుచున్నవి. ఆ పర్వతశ్రేణిపై నాటినట్లులున్న చెట్లును ఆచెట్లవెనుక గచ్ఛకాయరంగుతో ప్రకాశించు ఆకాశమును, అల్లంతయెత్తున పడమటగ వ్రాలి మెల్లగ పయనించు చంద్రుడును-ఒక చిత్రఫలకముపై చిత్రింపబడి నట్లున్నవి.

ఇప్పుడు మగపెండ్లివారు విజయనగరమునకు మూడు క్రోసుల దూరమున నున్నారు. అప్పటికి రాత్రి రెండుజాములు దాటినవి. హృదయములలో కలకలగి ఉక్కిరిబిక్కిరి చేయుచున్నవారి యానందము నిద్రను తొలగించుచున్నను, ఆ సహజ ప్రకృతిసుందరదృశ్యాలును, వాతావరణసమశైత్యమును, వారిని నిద్రాదేవి యొడిలో వేసి లాలించుచున్నవి. అప్పటికి అందలములలోని బాలవృద్ధులు చాలమంది నిద్రించిరి. పదాతివర్గము అలసి, సొలసి మందగమనమున నడచుచున్నది. భద్రగజారూఢుడైన రామరాజుయొక్క పార్శ్వగాములైన యాశ్వికులును, పురోగాములైన యాశ్వికులును, తమతమ యశ్వముల మందమందముగ నడపించుచున్నారు. రామరాజుయొక్క భద్రగజము మాత్రము ధీరగంభీరమైన గమనముతో గమించుచున్నది. అంబారీపై కూర్చున్న రామరాయలు, ప్రకృతిదృశ్యాలతిలకించుచు అందులో లీనమైనాడు. ఈ విజయనగర మహాసామ్రాజ్యము చిరస్మరణీయమైనను నేడేలనో

వింతవింతసోయగముల సీనుచున్నది! ఇదివఱకు దృష్టిపథమున పడనిచిత్రవిచిత్రదృశ్యాలు నేసుపడుచున్నవి. ఇదివఱకేనాడును ఎఱుగని వినూత్నమైన సంచలనము హృదయములో తీయని బాధను కలిగించుచున్నది.

విజయనగరమును మఱింత కొంత సమీపించినాడు. రామరాజపిత శ్రీరంగరాయలు ముందునకు వచ్చినాడు. ఒక్కసారి అందఱను హెచ్చరించినాడు. హెచ్చరికతోడనే యొక ఆజ్ఞ యొసగినాడు. తోడనే మందుభిధ్వాన సమాన ధ్వానలతో భేరీభాంకరణములు చెలరేగినవి. మంగళతూర్య నిస్వనము లంబరపూరితములై సెలంగినవి. పటహా, భేరీ, కాహళ శబ్దము లాకసమును చిల్లులు పొడిచినవి. నిద్రించిన వారు ఉలిక్కిపడి లేచి కనుల నులుముకొనిరి. తూగుచుండిన వారు త్రుళ్ళిపడి మొగముల తుడిచికొనిరి. అందఱి హృదయము లొక్కసారిగ నుప్పొంగినవి. అంతకంతకు ఉద్రిక్తమైనవి. ఒకవిధమైన తీవితో నిండి పోయినవి.

ఒక్కసారిగ శబ్దము లాగినవి. దూరాన—రెండుక్రోసుల దూరాన— అల్లంత యెత్తున—దట్టమగు కాంతిపటలము కన్పట్టినది. ఆకాంతివెనుక ఉన్నతమై, సుందరమైన, సౌధోపరి భాగములు కనుపించినవి. అందు తాపిన మణులు చిన్నవి నక్షత్రములవలెను. పెద్దవి రాకానిశాకరులవలెను, వెలుగు చున్నవి. కోటలకు వ్రేలాడగట్టిన మణితోరణములు నక్షత్ర మాలికలవలె ప్రకాశించినవి. స్వనస్వానోభగము సౌధ్యములు

నుంచిన పూర్ణమణికుంభములు రెండును, బాలభాను గోళ ములవలె ప్రకాశించినవి. దీపవృక్షముల కాంతిపుంజము లామణులపై బడి ప్రతిబింబింపగా, ఆమణు లీనిన కాంతిచే విజయనగర మంతయు పూర్ణిమనాటి వెలుగు వె. సినది. పట్టణ మంతయు రేఖాఫలకముపై వ్రాసిన మసకమసక చిత్రమువలె కన్పట్టినది.

నిశ్శబ్దవాతావరణము చీల్చుకొని లెక్కలేనన్ని నగారా లొక్కుమ్మడిగ మ్రోయించిన ధ్వనులు వెలువడినవి! ఆధ్వను లతో పాటు వెలుగును అంతకంతకు సమీపించు చున్నది! వరునిపక్షమువారు మరియొక క్రోసు ముందుకు జనిరి. వధూ పక్షమువారటువైపునుండి కొన్ని గజములు ముందుకు నడిచిరి. ఉభయ పక్షముల వారికి నల్లంత యెడముండగ నొక్కసారిగ నగారా శబ్దము లాగినవి.

ఎట్టయెదుట శృంగారముగ నలంకరించిన పట్టపుటేనుగు నెక్కి శ్రీకృష్ణదేవరాయలు సాక్షాత్కరించినాడు. వందిమా గధులు ఒక్కుమ్మడిగ.—

రాజాధిరాజ రాజపరమేశ్వర మూరురాయరగండా!– జయ! జయ!

అరివీరభయద శుండాభదోర్దండా! జయ! జయ!

సరస సాహితీ సమరాంగణ సార్వభౌమా! జయ! జయ!

అని పొగడినారు.

భూసురు లాశీర్వాదములు గావించినారు.

వేంటనే మరొకసారి దుందుభిధ్వానములు చెలరేగి నిశ్శబ్దమైనవి.

వరపక్షమున వరుడు రామరాయలు ఉన్నతగజారూఢుడై చంద్రునివలె వెలుగుచున్నాడు. కొంచెము దూరముగ కుడివైపున తండ్రి శ్రీరంగరాయలు అంబారీపై కూర్చొని యున్నాడు. ఎడమవైపున రామరాయ సోదరులు వాహనారూఢులై యున్నారు. లెక్కకు మిక్కిలిగ నున్న రాజనందను లెల్లరు రాయరాయల పరివేష్టించి యున్నారు. ఒక్కసారిగ దుందుభిధ్వానములు మ్రోగి యాగినవి. వెంటనే వందిమాగధులు—

శ్రీరంగ రాజసుత చిరంజీవి రామయరాజా! జయ! జయ!
సమస్త సద్గుణస్తోమభద్రా! రామయరాజా! జయ! జయ!
పరచండదుర్గ భయంకర! రామయరాజా! జయ! జయ!
భూనుత సాహసధుర్యా! రామయరాజా! జయ! జయ!
అని పొగడినారు!

భూసురు లాశీర్వాదము గావించినారు.

వరపక్షమువారి వరనగారా లొక్కసారిగ మ్రోగి యాగినవి.

అటువైపునుండి శ్రీకృష్ణదేవరాయలు భద్రగజావరోహణగావించినారు. ఇటువైపునుండి శ్రీరంగదేవరాయలుంగారు గజావరోహణ గావించినారు. ఆవెనుక రామరాయలు అవరోహణ గావించినారు. తోడ్తోడనే యుభయవర్గములలో నెల్లవారును క్రిందికిదిగినారు. వధూపక్షమువారు తెచ్చి పట

చిన రత్నకంబళ్ళపై వరుని పక్షమువా రాసీనులయినారు. ముత్తైదువలు గంధాక్షతల కురియించినారు. విలాసీజనులు పన్నీటిజలవర్షపాతము గావించినారు. ఇంకను నెన్నియో ఉచితమైన విడిదిమర్యాదల గావించినారు.

ఆరాత్రియును, మరునాడును, సాంగములు జరుగు చునే యున్నవి. తెల్లవారుఝామున శుభముహూర్తము. ముహూర్తమునకై సర్వమును సిద్ధము గావింపబడినవి. సాలంకృతులు రామరాయలు వివాహమంటపమును చేరినారు. వధూవరుల కూర్చుండబెట్టి దిష్టితీసివేసినారు. కాలిగోళ్ళు తీయుట మొదలయిన సాంగములు అయిపోయినవి. వెంటనే వధూవరులు మంగళస్నాన మాచరించి వివాహవేదిక నలంకరించిరి. కొన్ని సాంగముల యనంతరము వరుడు వధూపక్షమువారిచ్చిన చీనిచీనాంబరములను, వధువు, వరపక్షము వారొసగిన చీనిచీనాంబరములను ధరించి,వికసించిన పూవువు, వికసింపనున్న మొగ్గయును బోలి ప్రకాశించిరి. రాజాధిరాజ రాజపరమేశ్వరు శ్రీ శ్రీకృష్ణదేవరాయమహారాయలు సమంత్రకముగ కాళ్ళుగడిగి కన్యాదానము గావించిరి మరికొన్ని సాంగములు జరిగి పోవుచున్నవి. రాజపురోహితుడు వధూవరులచే ప్రతిజ్ఞలు చేయించినారు. తర్వాత వరుడు మంగళతూర్యనినాదములు మిన్నుముట్టగా మంగళసూత్రముచే వధూగళాలంకృతము గావించినాడు. ఒక్కసారిగ భూసురాశీర్వచనములు మిన్నుముట్టినవి. తోడనే గంధాక్షతలు

సభాపరులపై గుదిసినవి. కొలది సేపటిలో తలంబ్రాలు పోసి కొనుట గూడ పూర్తి అయినది. వివాహము ముగిసినది. తిరుమలాంబిక రామరాయల పరమైనది. శౌర్య, ధైర్య, సాహసధుర్యుని పతిగ బడసితినని తిరుమలాంబిక యుబ్బిపోయినది. వీరాధివీరుని జామాతగ బడసితినని శ్రీకృష్ణదేవరాయలు ఉబ్బిపోయినారు. అరణముగ నెంతో ధనాదుల నొసగినారు. సర్వసేనాధ్యక్షపదవి నొసగి గౌరవించినారు. క్రొత్తగ, సిద్ధవటము- పొత్తపి- ఉదయగిరి దుర్గముల నొసగినారు. ధన్యుడనయితినని ఆనందపడినారు.

## 6

శ్రీకృష్ణదేవరాయలు తన అవసానదశలో తన సోదరుడైన అచ్యుతరాయలను విజయనగర సామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుని గావింపదలచి అల్లుడగు రామరాయల బిలిచి యారీతిగ జేయుమని యొప్పించినాడు. రాయలయనంతరము అచ్యుతరాయలే పాలకుడైనను రామరాయలయాజ్ఞ దేశమంతట పాటింపబడుచున్నది. ఇపుడు సర్వసేనాధిపతిగ తనసోదరుడు తిరుమలరాయని నియోగించినాడు. యోధాదియోధుడు వెంకటపతిరాయల సేనాపతిగ నియమించినాడు. తన రక్తబంధువుల నెందఱనో ఉన్నతపదవుల నిలిపినాడు. ఈరీతిగ విజయనగరమున ఆర్వీటి వంశజులు బలపడిపోయినారు.

శ్రీకృష్ణదేవరాయలవారి యల్లుడగుటచే రామరాయలను అళియరామరాయలని అందఱును వ్యవహరింప దొడగిరి. రాయసల పైనుండిసంతటి గౌరవమును అతనియెడగూడ నుంచిరి.

అచ్యుతరాయలభార్య వరదాంబిక సలకరాజపుత్రిక, ఆమె సోదరులైన పెదతిమ్మరాజును, చినతిమ్మరాజును, విజయనగర సామంతరాజులు, రాజబంధువులగు కారణమున రాజధానియందు కొంత పలుకుబడి గలిగి యున్నారు. నేడు రాయల యనంతరము రాజైన యచ్యుతరాయలు వీరికి బావ యగుటచే ఈ సోదరద్వయము దురాశావహులైనారు. రాజ వంశమున ప్రాముఖ్యముగలిగి ప్రజలకు ప్రీతిపాత్రుడై యున్న రామరాయల నెట్లయిన స్థానభ్రష్టుని గావించి ఆపదవి నాక్ర మింప వలెనని తత్ప్రయత్నమున నిమగ్నులైనారు. ప్రతిదినము తమ తోబుట్టువగు వరదాంబికతో మంతనముల సాగింప మొదలిడినారు. ఆమెయు తనభర్తను పీడింపసాగినది. రామ రాయల స్థానమున చినతిమ్మరాజును నియోగింపుమని యను దినము ప్రార్థింప సాగినది. నయవినయములతో చెప్పి చూచి నది, కడపటికి అలిగినదిగూడ. అయినను అచ్యుతరాయలు లెక్కించలేదు. రామరాయ లెంతటివాడో అచ్యుతరాయలకు బాగుగ తెలియును. రామరాయలన్న ప్రజల కెంతప్రీతియో గూడ నెఱుగును. రామరాయలు ప్రజాపాలనమునం దెంత దక్షుడో గూడ నెఱుగును.

అచ్యుతరాయ లంతసమర్థుడు గాడు. మొదట మొదట భార్యమాటల వినకపోయినను, పోనుపోను, కొంత మెత్త బడినాడు. సలకము చినతిమ్మరాజును గూడ రామరాయ లంత వాడాకు తెచ్చినాడు. అయినను చినతిమ్మరాజు తృప్తి

పడలేదు. రామరాయల నెట్లయినను తప్పింప ప్రయత్నము సాగించుచునే యున్నారు.

ఇతనికి బాగుగ సాహాయ్యము చేసినవారు రాజపురోహితుడగు తాతాచార్యులును, ఆస్థానపండితుడగు నరనాథడిండిముడును. తాతాచార్యులను వరదాంబిక ధనధాన్యములచే తృప్తిపొందించినది. సలకము చినతిమ్మరాజు గొప్ప రాబడిగల అగ్రహారముల అచ్యుతరాయలచే నిప్పించినాడు. అట్లే డిండిమునకు గూడ గావించినాడు.

ఇతనివలలో పడినవారు కొందరు దండనాథులును గలరు. సలకముతిమ్మరాజు వారికి దుర్గాధిపత్యముల నొసగి పెట్టినాడు.

ఇవన్నియు రహస్యముగనే జరిగిపోవుచున్నవి. విజయనగరపుటంతిపురమున రాణులగు మలదేవియు, చిన్నాదేవియును, రామరాయలసతీమణి తిరుమలాంబికయును కడుజాగరూకులై మెలగుచుండిరి. ఏనాటికానాడు అంతఃపురమున జరుగుచున్న మంత్రాలోచనల నెఱుగుటకొఱకై చారుల నియమించిరి. అయినను వారు కృతకృత్యులు కాలేకపోయిరి. తిరుమలాంబిక తెలివిగలది. తన చేటికనుపిలిచి, వరదాంబికాప్రియదూతికతో చెలిమి చేసికొను మన్నది. తర్వాత తన సన్నిధికి గొనిరమ్మన్నది. మొదట మొదట ఈకార్య మంతసఫలీకృతముగ కన్పట్టకున్నను పోను పోను కొంత సుముఖమైనది. వరదాంబికా ప్రియదూతిక రాజవదన యంతఃపురమునకు

వచ్చినప్పుడు తిరుమలాంబిక యామెను కౌగలించుకొని ముద్దాడి– "నీవు నాకు చిన్ననాటి హితురాలవు. ఆ మరణాంతము మనస్నేహము కొనసాగవలెనని మా యభిలాష" అనుచు తనమెడలోని మణిహారము తీసి యామె మెడలో వేసి భద్రముగ దాచుకొమ్మని చెప్పినది. ఈ సంఘటన జరుగుతఱి తిరుమలాంబిక సమీపమున నెవ్వరును లేరు. అయిననేమి ? గోడలకు చెవులుండును గదా !

ఆరాత్రి రామరాయలు శయ్యాగృహమునకు రాగానే ఎదురుచూచుచుండిన తిరుమలాంబిక ఆప్యాయముగా నాతనిని కంఠాలింగనము చేసి, ఆ స్నిగ్ధతర హృదయమునకు హత్తుకొని ఆతని మొగమును ఊరక చూచుచు నిట్టూర్చినది. ఏదియో వినుటవలన నామె భయావహిత అయినదని రామరాయలు చూచుటతోడనే భావించినాడు. ఆమెను కూర్చుండబెట్టి సముదాయించుచు "భీతావహురాలవైయున్నా వెందులకు?" అని వీపున తట్టినాడు. "నా కేలకో భయముగనున్నది. ఇట్టి స్థితిని నే నేనాడును పొందలేదు. ఎన్నియో రాజకీయపు కుట్రలను గురించి వినియున్నాను. మాతండ్రి రాజ్యమునకు రాకముం దెన్నియో యిట్టివి జరిగినవని మాతల్లి చెప్పినది. వానిని గురించి నాగుండె లేనాడును బెదరినవి కావు. నేడు మనయంతఃపురముననే ఎన్నియో కుట్రలు జరుగుచున్నవని విని అదియుగూడ మిమ్ముల........" అనుచు పూర్తిగ నుచ్చరింపలేక కన్నీరు వాల్చినది. రామరాయలు లేచుచునను

పదరక ఆమెను నీపుత్రిక యైనాదార్ఢ్యను "సచ్చిదానా! నా ప్రాణమున కపాయము వచ్చునని భయపడుచున్నావా! ఈ కుట్రలు పన్నుచున్నవా రెవరోగూడ నాకు తెలియును ఇందెంతమంది పనిచేయుచున్నారో గూడ నాకు తెలియును. వారెన్ని చేసినను రామరాయల సమీపమునకుగూడ రాలేరని నమ్ముము" అనెను.

"ఈనాడు వరదాంబికా ప్రియసఖి యైన రాజవదనను రప్పించితిని. ఆమెవల్ల కొన్ని వృత్తాంతముల నెఱింగితిని. వాని వలన మనకాపద రానున్నదని తెలిసికొంటిని. ఎంతత్వరలో వీలైన అంతత్వరలో మనమిచటనుండి తప్పుకొనుట మంచిదని తా నన్నది"

"చెప్పదలచిన విషయమును గడుసుగ చెప్పినది. హెచ్చరికను, సలహాగా ఫిరాయించినది. రాజ్యాంగపు ఎత్తులనగా నట్టివే! రాజవదనను నీ వెప్పటినుండి యెఱుగుదువు!"

"చాలకాలమునుండి యెఱుగుదును."

"అనగా...మీ పినతండ్రి వివాహమైనప్పటి నుండియే గదా!"

"అవును. చిన్నప్పటి నుండియు మేము సఖులమే!"

"కావచ్చును, మీరిపుడు చిన్నవారుగారు. ఇవి రాజ ప్రాసాదములు, మరునిముషమున ఏమెట్లగునో- ఎవరెట్టివా రగుదురో- నమ్ముట కష్టము.

"ఆమె నా ప్రియసఖి, ఆమె నేల యనుమానించెదవు?"

"రాజ ప్రాసాదములలో లెక్కలేనన్ని కుట్రలు జరుగు చుండును. మాటలబట్టి శత్రులెవరో మిత్రులెవరో తెలిసి కొనుట కష్టము. నీకు ప్రత్యక్షానుభవము లేదు. జాగరూకతతో మెలగుము. అందఱను నమ్మరాదు."

అదివిని తిరుమలాంబిక యంతేయని అనుకొన్నది. స్వీయానుభవము లేకపోయినను, తత్సంబంధిక విజ్ఞానము కొంత యున్నది. నాటినుండియు రాజవదనను తన చేటియైన సునందను ఒకకంట కనిపెట్టియే ప్రవర్తిల్ల సాగినది. రామరాయలుమాత్రము తిరుమలాంబిక యంతఃపురమునకు నిర్ణీత కాలముల రాఁజాలించెను.

అచ్యుతరాయల పాలనలో పదేడులీ విధముగనే సాగినవి. రామరాయల పలుకుబడి పూర్వవిధముననే యున్నది. కాని పోను పోను సలకము తిమ్మరాజు పలుకుబడి హెచ్చుచున్నట్లు కనిపించినది. సేనలన్నియుగూడ, రామరాయల యాజ్ఞకు లోబడియే యున్నవి. అయినను కొద్దిమంది దండనాథులు సలకము తిమ్మరాజు కుట్రలో చేరి యున్నారు. అచ్యుతరాయలు నిరంతరము వరదాంబిక చేయు నొత్తిడివలన రాను రాను లొంగిపోవుటయే దీనికి కారణము. అనవరతము రోగపీడితుడై జీవచ్ఛవమువలె జీవింప జొచ్చినాడు. వ్యక్తిత్వమును పూర్తిగ పోగొట్టుకొన్నాడు. వరదాంబిక చినతిమ్మరాజుల చేతులలోని బొమ్మయయినాడు.

ఇట్టివిజయము గాంచినవరదాంబిక ఎంత చాతుర్యము గలదో- ఎంత పట్టుదల గలదో తెలియుచున్నది. తన ప్రియ దూతిక రాజవదన ద్వారా ఎల్లవిషయముల నెఱుగుచున్నది. రాజకీయపరిజ్ఞానము వరదాంబికకు ఎక్కువగా గలదు. శ్రీకృష్ణ దేవరాయలకు లోబడియుండినసామంతరాజపుత్రికవరదాంబిక సామంతులలో ఎన్నెన్ని కుట్రలు జరుగుచుండునో-ఎన్నెన్ని విధముల సామ్రాట్టులకు తలనొప్పి గల్పింప పన్నాగముల పన్ను చుందురో ఎన్నెన్ని విధములుగ, సామ్రాజ్యమున కల్లోలముల గల్పించి స్వతంత్రింప వలెనని ప్రయత్నింతురో- తత్సాధనకై ఎన్నెన్ని కుతంత్రముల పన్ను చుందురో- తమ రాష్ట్రములోనే, - తమ అంతఃపురమునందే-బంధువులతో దాయాదులతో - ఎట్టెట్టి సంబంధములు గలిగి - ఎంతెంత జాగరూకతతో నుందురో - ఇవన్నియు వరదాంబికకు చిర పరిచితములు. వరదాంబిక బాల్యము నుండియు చురుకైనది. విద్యావతికూడ. తండ్రికి నచ్చిన కూతురు. అందుచే తండ్రి మంత్రములలో పాల్గొనుచుండెడిది. తలలుతీసి తలలుపెట్టగల సామర్థ్యమును సంపాదించినది.

సలకము తిమ్మరాజు సామంతరాజెట్లాయెనో కూడ ఆమెకు పరిచయమే! తనతండ్రిమరణమునాడే-ప్రాణముకూడ పూర్తిగ పోకముందే చినతిమ్మరాజు తనతండ్రిసోదరులను కారాగారమున బంధించినాడు. మరికొంతమంది దాయాదు లనుకూడ అణ్లే గావించినాడు. అనూయకుడైన తనయన్నను

కాదని తానే సామంతరాజయినాడు. విద్యానగరమున ప్రతిష్ఠ సంపాదింప వలెననియు, తద్వారమున రాజ్యమునే కైవసము గావించుకొన వలయుననియు నూహించినాడు. మరికొంత మంది సామంతరాజుల గూడ కూడగట్టుకొన్నాడు. రాజవంశముతో సంబంధము చేయసంకల్పించి, ప్రయత్నించి కృతకృత్యుడైనాడు. చెల్లెలు వరదాంబికను శ్రీకృష్ణదేవరాయ సోదరుడు అచ్యుతరాయలకు వివాహము గావించినాడు. తన ఆశయసిద్ధికి అదె పునాదియని భావించినాడు.

శ్రీకృష్ణదేవరాయలు తన యనంతరము అనుజుడు అచ్యుతరాయలే రాజగునట్లు మంచికట్టుదిట్టము చేసియున్నాడు. ఇదివరలో నసలె కుట్రలు జరుగునేమోయని శంకించి జాగరూకుడై యుండినాడు. అపరపరాక్రమశాలియైన రామరాయలు శ్రీకృష్ణదేవరాయ శాసనమును పాలింప బద్ధకంకణుడైనాడు. రాజవంశమును కాపాడ ప్రతిజ్ఞ గైకొనియున్నాడు. అందుచేత అచ్యుతరాయలు అనాయసముగ రాజైనాడు. అప్పటినుండియే వరదాంబికా చినతిమ్మరాజులు కుట్రలలో మునిగియున్నారు. చినతిమ్మరాజెంత దురాశాపరుడో వరదాంబిక అంతదురాశాపరురాలు. తానేమో మహారాజ్ఞి యయినది. తన సోదరుడు మహామంత్రి కావలెనని యామె యభిలాష.

తన తోడికోడండ్రు తిరుమలదేవియు, చిన్నాదేవియు అసూయ [illegible] లెక్కలేదు. కాని ఆభావమును బయటికి

ప్రవర్తిల్లసాగుదు. పైగా వారియొక్క పూర్వముకంటెను అధిక
మగు గౌరవమున్నట్లు నటింపసాగెను. వారికి నేవిధముగను
అనుమానింపగూడదని యామెతలంపు.

# 7

ఒక సాయంసమయమున రామరాయలు తన గుఱ్ఱము
నెక్కి ఏకాకిగ వాహ్యాళి పోవుచుండెను. వాహనమెక్కి యేగి
తుంగభద్రాతీరమున కొంతసేపు విహరించుట యలవాటు.
చాలచాల క్లిష్టసమస్యలుగూడ నక్కడనే తీర్చికొనుచుండును
గూడ! ఈనాడు రజకవీధి నేగునపుడప్రయత్నముగ కొండోజీ
మేడవైపు చూచినాడు. చక్కనిచుక్కను చూచి తటాలున
ఆగిపోయినాడు. తానొక క్షణము తదేకదీక్షతో నటుచూడ
గనే యామె ముసుగును తలపైకి లాగికొని లోనికేగినది.

రామరాయల కానాటిసమస్య యామెచిన్న దెవరన్న దే!
ప్రతిదినమును రామరాయ లాదారిన వచ్చుచుండువాడే!
అటునిటు చూచునలవాటు లేదు. ఈనాటివలె కాతని నాక
ర్షించు దృశ్యము కన్నులపడలేదు. ఈనాడా రజకయువతి
యాకర్షించినది.

చంద్రలేఖనవోఢ. విద్యావతి. ఆస్థానపురోహితుడు
తాతాచార్యుల శిష్యురాలు. రజకకులనాయకుడును, విజయ
నగర దండనాయకులలో నొక్కరుడును నగు కొండోజీ ఏకైక
పుత్రిక. [illegible]పురమున ప్రవేశమేగాదు. అంపతి

కెస్త్ర్య కామముతో అత్యంతమైన చెలిమిగూడ గలదు. తాను రామరాయల గురించి ఎంతోవిన్నది. ఆతనిని చాల సారులు చూచినది. కొన్ని దినాలుగ ప్రతిదినము సాయంసమయము లలో నదే గవాక్షముకడ నిలుచుండి చూచుచునే యున్నది. ఈనాటి కాకర్షింప గలిగినది.

ఆకర్షణాపాశబంధితుడైన రామరాయలు తుంగభద్రా తీరమున చదికిలబడినాడు. చేతుల రెండిటిని వెనుకకు బెట్టి, శరీర మును వానిపైనూని, కాళ్ళుసారజాపి కూర్చున్నాడు. అలల కదలికపై దృష్టిసారించినాడు. అలలేనాడాతని హృదయకంప నానుకరణముగ వడివడిగ కదలుచున్నట్లు భావించుచున్నాడు. ఆ అలల కదలిక లాచిన్నదాని నీలకుంతలముల జ్ఞప్తికి తెచ్చు చున్నవి. అటులనే ఆదృశ్యము నంతటిని జ్ఞప్తికి తెచ్చుకొను చున్నాడు. అల్లదే రజకవీధి! వీధి మొగదల ఉన్నతసౌధము అద్దాలమేడలో గవాక్షముకడ చంద్రరేఖ! తదేక దృష్టితో చూచుచున్నట్లున్నది! అంతఃపురకన్యకా సౌందర్యము గలిగి యున్నది! ఊర్ధ్వభాగ సౌందర్య దర్శనము మాత్రమే ప్రసా దితము! అక్షియుగ్మమతి తరలము! ఆచట ఆమెయునికి ఒక క్షణము. ఆమె విద్యుల్లేఖ!

అప్పటికి చీకటిపడి చాలసేపయినది. కలనుండి మేలు కొన్న వానివలె చటాలున లేచినాడు. అశ్వారోహణ గావించి త్రుటిలో నిల్లుచేరినాడు. భోజనముకడ కూర్చున్నాడు ఏదో తిన్నాడు! రాత్రి శయ్యాగృహమున నతనిలోని మార్పును

కి సపెట్టినది తిరుమలాంబిక ! వెంటనే ప్రజానాథులు బహు కాంతానాథు లన్న సత్యమును గ్రహించినది.

మరునా డదేమార్గమున, అదేసమయమున, అదే దృశ్యము! విద్యుల్లేఖవలె ప్రకాశించి చంద్రలేఖ మరుగుపడి నది. రామరాయ లాగిపోయినాడు. ముందుకుసాగ కాళ్ళురా లేదు. భవనములో ప్రవేశింప మనసురాలేదు. కొంచెముసేపు తటపటాయించి గుఱ్ఱమును ముందునకే సాగనిచ్చినాడు. అదేతుంగభద్ర! అదేచోటు! అవేఅలలు! అవేకలలు!

రామరాయల భావనాప్రపంచములో మునిగినాడు. చిత్తము సర్వస్వము కామాయత్తమైనది. అరివీరభయంక రుడు! అరిజయము పొందగలడు. అరిషడ్వర్గజయము పొంద సామాన్యమా?

ఆరాత్రి తిరుమలాంబిక నిలదీసి యడిగినది. రామరా యలు తప్పించుకొన జూడలేదు. ఉన్నదున్నట్లు నుడివినాడు. తిరుమలాంబిక మనసు ఈర్ష్యాన్వితమైనది. మాత్సర్యపూరిత హృదయముతో బాధపడినది. తనదనుకొన్నది పూర్ణముగ తనకు దక్కునన్న యాశ వీడజొచ్చినది. ఆభావము ప్రబల మగు కొలది అసహనము హెచ్చినది. డెందము దహింపబడి నట్లయినది. బాధకోర్వజాలక కన్నీరుకాల్వలు గట్టనేర్చినది.

తిరుమలాంబిక రామరాయలను తనహృదయముకంటె నెక్కుడుగ ప్రేమించినది. అతడు తన యాత్మగను, అతని దేహమే తానుగను భావించినది. రామరాయలకు భార్య

తానొక్క తెయేయని ఆనందించినది. రాయలు మాత్ర మింత వఱకు ఏకపత్నీవ్రతుడే! తిరుమలాంబికను ఆదరపూర్వకముగ ప్రేమించినాడు. ఈనాడు మరొక స్త్రీనిగూడ ప్రేమించుచున్నాడు. క్రొత్తసరుకు వైపు మనసు ఉఱకలు వేసి పరుగిడుచున్నను తిరుమలాంబికయెడ ననాదరము లేదు. లేదు గాని ప్రాముఖ్యము క్రొత్తపడుచు సమాగమము వైపే పోరలుచున్నది. ఆమనసును త్రిప్పుకొనజాలకున్నాడు. తిరుమలాంబిక యవస్థను చూచి హృదయము ద్రవించినది. ఆమె సరసను చేరినాడు. తనవైపు లాగికొన్నాడు. సబాష్పకపోలముల నామెత్తుతోనెత్తి "రాణీ! నిన్ను నిరాదరణగ జూతునని భయపడుచున్నావా?" అని మెత్తని హృదయముతో లాలించినాడు.

"కాకపోవచ్చును. అసలీప్రశ్న యుదయించుటకే నే నొప్పను"

"అది విధికృతము రాణీ! నేనేమిచేయగలను?"

"అవును. తప్పుచేయునది మనము! నెపము విధిపైన!"

"పోనీ రాణీ! నీపైన ప్రేమ తగ్గినగదా బాధపడవలయు?"

"తగ్గదని మీరెట్లు చెప్పగలరు?"

"నాహృదయము చీల్చి చూడుము"

"కామప్రభూ! అది ఈనాటి నాపరిస్థితియెడ జాలి చెందిన హృదయమునుండి వచ్చు పలుకు! సానుభూతిమాత్రము! అంతేగాని ప్రేమ తగ్గకపోవు టెట్లు?"

"నమ్మకున్న నేనేమి చేయగలను?"

"నమ్ము టెట్లు ప్రభూ! ఈనాటి మీ చేష్టయే తార్కాణము. కామాన్వితమనస్కులు చంచలులు! కామతృష్ణగల వారి స్వభావము మార్పును కాంక్షించుటయే!" అని అనుచు తిరుమలాంబిక అతిరోషితయైనది. చటుక్కున లేచినది. బాణమువలె ప్రక్కగదిలోనికి తుఱ్ఱుమని పారిపోయినది. గుండెలు చీల్చుకొనివచ్చు దుఃఖముచే వెక్కి వెక్కి యేడ్వసాగినది.

అవును! తిరుమలాంబిక యన్న దానిలో లేశమంతైన యసత్యము గానరాదు. తిరుమలాంబిక వహించిన కోపము గూడ నసమంజసముగాదు. ప్రేమైకహృదయలగు స్త్రీలంతే! ఆహృదయపుతీరును తాను చవిచూచినదే? ఆహృదయపు బాధను గూడ నీనాడు చవిచూచినాడు. నిర్మత్సరముగ నాలోచించినాడు. తానింతకుముందాచరించిన విధానము తప్పని మనసులో ఒప్పుకొన్నాడు. నిర్మలప్రేమైకజీవి తిరుమలాంబిక కొఱకు ప్రక్కగదిలోనికి దూరినాడు ఇతనిని చూడగనే ఆమె దుఃఖము మరల విజృంభించినది. చేతులతో మోముగప్పి వెక్కి వెక్కి యేడ్చినది. కరిగిపోయిన రామరాయలు ప్రగాఢముగ కౌగలించి "రాణీ! నేనాభావము హృదయమునుండి తొలగించితిని నీవిక ఊరడిల్లుము. నీపాదములంటి ప్రతిజ్ఞ చేయుచున్నాను" అని అనగానే తిరుమలాంబిక తటాలున తన చేతులతో పతిచేతుల పట్టుకొని తన నేత్రముల కద్దుకొన్నది. దుఃఖాశ్రువు లానందాశ్రువు

ంగి పోయినవి. హృద్విలాస ముత్తరించినది. హృద్విలాస మంకురించినది. హృద్వేగోద్రేకముచే హృద్విభు నాశ్లేషించినది. ఆద్వాను మద్వైతమై చిద్విలాసమున తేలియాడినది.

చంద్రలేఖ కిప్పుడు ప్రొద్దుపోవుట లేదు. ఇదివఱకటి పరిస్థితి వేరు. ఆతనిదర్శనము కోసమే నిరీక్షించు చుండెడిది. మొన్నటినుండియు నట్లుగాదు. రామరాయుల నాకర్షించినది. ఆతని సమాగమము కోస మారాట పడసాగినది. సాయం కాలమువఱకు గూడ వేచియుండుట కిప్పుడు కష్టముగనున్నది. అంతవఱకు ప్రొద్దుపోక ప్రొద్దుపై విసుగుకొనుచున్నది నేడు సాయంతనము సాలంకృతయై అదే గవాక్షము కడ నిల బడినది. ఆపేక్షతో నిరీక్షించినది. ఎంతసేపు నిరీక్షించి నదో! ఆమె కాక్షణములు యుగములుగ కన్పట్టినవి ఎంతసే పయినను రామరాయుల దర్శనము లేదు ఇన్ని యుగములు తనను వేధించిన వేడివెలుగు పశ్చిమాంబుధిలో మునిగినాడు. చంద్రలేఖ నిరాశాహత యైనది. నిట్టూర్చి కన్నీరు కార్చుచు లోనికేగుచు మరల నాశతో నొకమా రటుచూచినది. సజల నేత్రదృష్టిపథాన- దూరాన- నొక అశ్వికుడు గన్పట్టినాడు. రామరాయలే యని యూహించినది. దుఃఖాశ్రువు లొక్క పారిగ ఆనందాశ్రువులుగ మారినవి. విసురుగావచ్చి గవాక్షపు కమ్ములకు మొగమును హత్తినది. అశ్వికుడు అంతకంతకు సమీపించినాడు. కాని వాడు రామరాయలు గాడు. చంద్ర లేఖ చప్పచల్లారి నేలగూలినది.

# 8

దక్షిణమున జింజీకోటనాయకుడు తిరుగబడెనని వార్త వచ్చినది. అచ్యుతరాయలు రామరాయలను ససైన్యముగ వెడలుమని యాజ్ఞాపించినాడు. తోడనే వెంకటాద్రి సేనానాయకత్వమున అయిదువేల యాశ్వికదళమును, నలువదివేల పదాతి వర్గమునుదీసికొని రామరాయలు కదలినాడు. గమ్యము సమీపింపగ నేరామచంద్రనాయకుడుతనబలములనంతకూడగట్టుకొని మార్కొనినాడు ఆనాడు ఘోరసంగ్రామము జరిగినది. ఆరాత్రి అందఱును విశ్రాంతి తీసికొనుచుండు సమయమున నొక యాశ్వికుడు హుటాహుటిగ రామరాయల శిబిరముకడకు వచ్చినాడు. అనుజ్ఞ వేడకుండగనే లోపలికి చొచ్చుకొని పోయినాడు. రామరాయ లేదో వ్యూహమును గుఱించి యాలోచించుచు మేల్కొనియే యున్నాడు. ఆగంతకుడు కేలు మొగిడ్చి ఒక విన్నప మాతని చేతి కందిచ్చినాడు. రామరాయలది చదివి విభ్రాంతుడయినాడు. ఆనందాశ్చర్యములతో ఆయాశ్వికుని వైపు చూచినాడు. ఎక్కడో చూచినట్టున్నది గాని స్ఫురణకు రాలేదు. ఆ ముఖలావణ్యము నొకక్షణముసేపు దీక్షగా జూచి మరల జాబుపైకి దృష్టి సారించినాడు.

"ఈజాబు నెవరువ్రాసిరి?" అని రామరాయలు ప్రశ్నించినాడు.

"అది నావిన్నపము. నేను మీ యాశ్రయములోనున్నవాడనే! విజయనగర వాస్తవ్యుడను."

"అయిన, సలకము తిమ్మరాజు నన్ను తుదముట్టించుటకే ఈ పన్నాగమును పన్ని సైన్యమును నా వెనువెంటనే పంపుచున్నాడా ?"

"అవును ప్రభూ !"

"నిజమా ?"

"ముమ్మాటికిని"

"అయిన, సర్వసేనాధిపతి తిరుమలరాయలకీ కిటుకు తెలియునా ?"

"తెలియదు"

"తెలియకుండుటెట్లు ?"

"తెలిసిన చో తిమ్మరాజునాటలు సాగునా ప్రభూ ! తిరుమలరాయలకు తెలియకుండగనే తనకు లోబడిన సేనానాయకుల నాయకత్వముక్రింద గొప్పసైన్యమును పంపుచున్నాడు"

"నీవెవరో విశదముగ తెలిపెదవా ?"

"ప్రభూ నేను మీభృత్యుడనే! వివరములు కావలెనన్న రేపు విన్నవించుకొందును. విశ్రాంతి కనుజ్ఞ నొసగ ప్రార్థన. మీరీ యుభయసైన్యములతో నెట్లుపోరెదరో దానిని గుఱించి మాత్రము యోజింపుడు. లేకున్న మన సైన్యములు తుత్తునియలై పోవును. మీకుగూడ నపాయము సంభవింపవచ్చును. వచ్చుచున్న సైన్యము చాల గొప్పది. పదివేల యాశ్వికులు, ఒక లక్ష పదాతులు.

అత్యంత విస్మితుడైన రాయలు ఆయాశ్వికుని విశ్రాంతికై పంపలినాడు. యోజించుచు కూర్చున్నాడు. కొంతసేపు

యోజించి రామయామాత్యతో డరమల్లును లేపినాడు. ఆత నితో కొంతసేపు యోజించి ఒక నిర్ధారణకు వచ్చినాడు. అనంతరము రామయామాత్యుడు లేఖనొకటి లిఖించి యొక అశ్వికభటునకిచ్చి పంపినాడు.

రామచంద్రనాయకుడు సమర్థుడు. ఒక సంవత్సరము నుండియు నతడు సలకము చినతిమ్మరాజుతో మంతనముల సాగించు చున్నాడు. ఇతనికి ఎన్నో ఆశలు చూపి తిమ్మరాజు తిరుగుబాటు చేయించినాడు. ఈతని సేనాధిపతి నరసింహ నాయకుడు. ఇతడు సాళువ వంశములోనివాడు. రామచంద్ర నాయక నరసింహనాయకులకు మనస్పర్థలు గలవు.

# 9

"ఓ సాళువవంశోత్తమా! సాళువ వంశము ఆర్వీటి వంశములకు గల సంబంధము లొక్క సారిగ జ్ఞప్తికి తెచ్చు కొనుడు. తమ పితామహుడు సాళువ నరసింహరాయలు విజయనగరాధిపత్యము వహించుటకు సాహాయపడినది. "సాళువ నరసింహరాజ్య ప్రతిష్ఠాపనాచార్యుడు" అర్వీటి బుక్కరాజు. ఆ ఆర్వీటిబుక్కభూపాల వంశములోని వీరుడే ఈ రామరాయలు సాళువ నరసింహరాయలును, తుళువవంశ శ్రీకృష్ణదేవరాయలునుపరిపాలించినవిజయనగర సామ్రాజ్యము నేవడో-తెలియనిఒక మూలనున్న పులికాటుకుయజమానియై- నేడు విజయనగర ఆస్థానమును ప్రవేశించి ఆ సామ్రాజ్యమును వైవసము చేసికొనగోరుచున్న సలకము చినతిమ్మరాజును

చూపించి ఈ పిక్కటిమీట—నక్క—నుస్వర్గాధిపత్యమునకు ప్రోత్సహించిన ట్లుండగలదు! పురోడాశమునకు కుక్కను ప్రోత్సహించిన ట్లుండగలదు. విజయనగరరాజ్యధ్వజము నెగురవేసి. ధరణీచక్రము నవక్రపరాక్రమముచే నుజ్జ్వలముగ నూగించిన సాళువవంశసాగరసుధాంశువు నరసింహరాయ లెక్కడ! నిఖిలధరణీధవపూజితపాదుడు శ్రీకృష్ణదేవరాయమహారాయ ప్రభు డెక్కడ! అట్టిమేటి చక్రవర్తు లేలిన విజయనగరమహాసామ్రాజ్యమున కిట్టిబక్క—చిక్కి—బీదనరాలువాఱిన తిమ్మరాజు రాజుగావలెనని యుబలాట పడుచో తమబోటి యాభిజాత్య సంపన్ను లూరకొన్న ధర్మమునెడ యుపేక్షాభావము వహించినట్లు కాదా!

మీ రిట్టి యన్యాయము నుపేక్షింతురని నేనపేక్షింపను. మీ రెవరో యెట్టివారో నాకు బాగుగ తెలియును. మీ గుణగణముల గుఱించి వినియున్నాను. మిమ్ముల నింతవఱకు చూడలే దంతే! అంతయేల? మరునిముసములో మిమ్ముల కలిసికొన గలనని భావించుచు గూడ నున్నాడ. రామరాయ మహామంత్రి యీ విషయము విశదముగ మీకు నెఱిగింపుమని నన్ను కోరినారు. నిదానముగ నాలోచింపుడు. మీరు సర్వసేనాధిపతులు. సర్వసైన్యములు మీ చేతిలో నుండును. మీరు విజయనగర రాజవంశ ప్రతిష్ఠ నపేక్షింతురేని బలవంతమైన హిందూ సామ్రాజ్యము దక్షిణాపథమున దినదినాభివృద్ధి గాంచును గాక! - ఇదిగో - నేటిరాత్రికే _ యీ

రామచంద్రనాయకుని - సలకము తిమ్మరాజుతో కుట్రచేసి విజయనగరరాజ వంశమునకే చేటుదేగోరు ఈ రామచంద్ర నాయకని - బంధించుటకై చేతులు కలుపుడు.

విజయనగరరాజవంశమును సమూలముగ నంతమొందించి- ఆప్రయత్నమునకు ప్రప్రథమ ప్రతిఘాతమైన రామరాయ మహామంత్రిని తుదముట్టింప ఈ రామచంద్రనాయకునిచే తిరుగుబాటు గావింపజేసి - అచ్యుతరాయలచే రామరాయ లాజ్ఞాపింపబడునట్లుజేసి - సైన్యమును కొద్దిపాటిదే యుప్పింపజేసి-వెనుక-ఎనలేని సైన్యమును పంపించుచున్నాడు తిమ్మరాజు! మీరిప్పుడు సాయము గావించితిరా- మేము దీనిని సాయముక్రింద పరిగణింపమని తలంపకుడు. ఇది మీ బాధ్యత యని భావించి- మా బాధ్యతగ జింజికోటకు మిమ్ములనే నాయకుడుగ ప్రకటింపింతుము. పరిసరప్రాంతములగూడ మీపాలనక్రిందికి తెత్తుము.

మీజవాబును వెంటనే మా యాశ్వికుని చేతనే పంపుడు. లేదా మీరే స్వయముగ బయలుదేరి వచ్చుచో నెంతో సంతోషింతుము.

భ వ దీ యు డు,

"రామయామాత్యతోడరుమల్లు"

ఈ తోడరమల్లు కవిత్వము నిడువలకు కొంత చదు చూచిన నరిసింహానాయకుడు ఈ దిన మాతని దర్శనముగూడ గలుగునని యానంద పడినాడు. దిగంతముల తనకీర్తిని వెల

యించిన వీరాధివీరుడు రామరాయమహామంత్రితో స్నేహము కలుగగలదని మనసులో తనకుతానే అభినందనలు పలుకు కొన్నాడు. మరొకసారి జాబును ఆమూలాగ్రముగ జదివినాడు. గతచరిత్రమంతయు నొకపరి తన మనోనేత్రముల ముందు గిఱ్ఱున తిరిగినది. వెంటనే అశ్వారూఢుడై రామరాయల శిబిరమున కేగినాడు. స్నేహపురస్సరముగ పరిచయము గావించుకొనినాడు.

మరునాడుదయమునకు రామచంద్రనాయకుడు బంధీకృతుడైనాడు. ఉభయసైన్యములును వేంకటాద్రి నరసింహ నాయకుల యధ్యక్షతల క్రింద విజృంభించి ఉత్తరాభిముఖము లైనవి.

అప్పటికి సాయంకాల మయినది. దక్షిణాభిముఖమై వచ్చుచున్న తిమ్మరాజు సైన్యము లలసి విశ్రమింప గోరినవి. అట్లుగావింప వారిసేనాధ్యక్షు డనుజ్ఞ నొసగినాడు. ఆశ్వికు లశ్వములనుండి దిగినారు. పదాతు లప్పుడే చదికిల బడినారు. ఎడమవైపునుండి నక్కల కూతలు వినవచ్చినవి. భూమి వదరి నది. ఈ దుశ్శకునముల జూచి సైనికు లెల్లరు అప్రమత్తత వహించి దిక్కులు పరికించుచు లేచిరి. అప్పుడప్పుడే కులాయ ములకు చేరుచున్న పక్షులు గబగబ చెట్లనుండి లేచి వికా వికలుగ పరువెత్తుచు రోదనధ్వనులు గావించినవి. సైనికు లెల్లరు శస్త్రధారులై నిలువంబడిరి.

ఇంతలో గుండెల ఝల్లుమనిపించు దుందుభిధ్వానములు చెలరేగినవి. ఆ శబ్దము వెంటనే యాశ్వికసైన్యము శాణ

వేగముతో వచ్చి పైన పడినది. ఆ వెనువెంటనే పదాతులు గూడ ముట్టడించిరి. ఈటెలు- గుండ్రగొడ్డండ్రు - కత్తులు - మెఱసినవి. లోహధ్వనులు హాహాకారములతో మిళితములై మొగసినవి. రక్తము పడి వలు గట్టినది. భిన్నాంగములు చిన్నభిన్నములుగ పడి యుద్ధభూమి నంతయు గప్పివేసినవి. ఎక్కడ జూచిన బీభత్స దృశ్యము!

ఆరి తేరిన విజయనగర సైన్యముల లొంగదీయుట సులభమైన పని గాదు ఆ వచ్చినవారందఱు గూడ నారి తేరిన యోధులు. ప్రచండబలసమన్వితులు.

కొన్ని వారాలపాటు యుద్ధము కొనసాగినది. ఈమ్మ రాజు సైన్యముల కాహారపదార్థముల సరఫరా తగ్గిపోయినది. తద్వారా శక్తులు సన్నగిల్లినవి. సైనికులలో విసుగు జనించినది. ఇక రామరాయుల బలముల గెలుచుట కల్లలోని వార్తయైనది. సేనానాయకులు కింకర్తవ్యతామూఢులై యున్న సమయములో అహవాని దుర్గాధిపతి కోనదేవరాజు విజయనగరమునుండి వచ్చి వారిలో కలిసినాడు. రామరాయల చంపు ప్రయత్నములో నిమగ్నులైనారు.

రామరాయలు సుఖనిద్ర నెఱిగి యీనాటికి మూడు మాసాలు దాటినది. అతనిని కంటికి రెప్పవలె కనిపెట్టుకొని యున్న ఆయువకుడు గూడ నేడు ప్రమాగన్ను వెట్టి నిద్రపోవుచున్నాడు. అట్టిసమయమున శిబిరమును ప్రవేశించినాడొక ఖడ్గధారి. స్వాగతము చారెవరి ఒక్కయావరికైనా లేదో ఏదో

పీడకలవచ్చి త్రుళ్ళిపడినట్లుగ మేల్కొని రామరాయలవైపు జూచినా డాయువకుడు. చివుక్కునలేచి తటాలున కత్తిబెట్టికి అగంతకుని ఎత్తినచేతిని ఎత్తినట్లే ఖండించినాడు. వాడు పారిపో నుంకించగా నదే యాయుధముచే ఒకకాలును నఱికి నాడు. చిల్లునచిమ్మిన రక్తము రామరాయల నొసలిపై బడి నది. చటుక్కున మేల్కొంచి ఉపటుతో లేచినాడు. తటా లున కరవాలమును ... గినాడు. ఒక్కతృణములో జరిగిన దంతయు నవగాహనము చేసికొన్నాడు. అత్యానందముతో నాయువకుని గాఢాలింగనము చేసికొన్నాడు. ఆ యాలింగనములో నాయువకుడు స్వర్గసుఖము ననుభవించినాడు.

ఇంతలో కలనుమేల్కొన్న వాని వోలె రామయామాత్యతోడరమల్లు మేల్కొన్నాడు. అంతయు చూచి దీర్ఘముగ నిట్టూర్చినాడు. హంతకుడు ఆదవాని దుర్గాధిపతి కోనదేవరాజని గుర్తుపట్టినారు. అతడు మరణోన్ముఖుడగుచు అన్నివిషయములు జెప్పినాడు. అచ్యుతరాయలు రోగపీడితుడగుటయు- సలకము తిమ్మరాజు రాజవైద్యుని లోంచుకొని ఆశపెట్టి మందుకు బదులు విషమిప్పించినదియు - అచ్యుతరాయలు చనిపోగా చినవెంకటాద్రిని రాజుగావించినదియు- అధికారమంతయు హస్తగతము చేసికొని సర్వసేనాధిపత్యము తిరుమలరాయలనుండి లాగుకొనగా తిరుమలరాయలు రామరాయల రాజ్ఞకోసము నిరీక్షించు చున్నదియు - ఇంతలో నిక్కడి యుద్ధఫలితము విని రామరాయల నొల్లయిన చంపి

గమ్మని తన్నొప్పించిన విషయమును - దండనాథులలో చాల మందిని ధనాశ దుర్గాధిపత్యపుటాశల గొల్పి లోబరచుకొన్న విషయమును- ఎల్లవిషయముల జెప్పి ప్రాణముల వదలినాడు.

తర్వాత ఒకవారములోయుద్ధముసమాప్తమయినది. రామరాయలు తిరుమలరాయలకు, విజృంభింపవలదనియు- తాను, వచ్చునందాక ఓపిక పట్టవలయుననియు రహస్యముగ జెప్పి పంపించినాడు. సైన్యములు కొంత విశ్రాంతి తీసికొని విజయనగరాభిముఖము లైనవి. ఇపు డవసరము లేదు గాబోలు! రామరాయల యంగరక్షకుడుగా నుండిన యువకుడు మాయమైనాడు. సర్వస్వము పోగొట్టుకొన్న మానవుని వలె రామరాయ లాతని కోసము గాలించినాడు. ఎందును కనబడ లేదు.। ఎక్కడి కేగినాడు ? ఎవడాయువకుడు ?ఎక్కడో చూచిన ట్లున్నది. స్ఫురణకు వచ్చుట లేదు. ఎంత ముఖకాంతి ! ఎంత తేజము ! ఎంత శౌర్యము !

# 10

చంద్రలేఖ తిరుమలాంబికకు బాల్యస్నేహితురాలే ! రామరాయల మన సామెయందు లగ్నమైనదని వినగానే ఈర్ష్యవహించినది. రామరాయలు పశ్చాత్తప్తుడై అప్రయత్నమును విరమించితి నని ప్రతిజ్ఞ చేయగానే ఈర్ష్యవిడనాడినది. అయినను చంద్రలేఖను చూచినపుడు అసూయ మాత్రము ఎక్కడనుండి కలుగునో గాని- కొంచెము వహించెడిది. కొన్ని

దినములు చంద్రలేఖ కనబడలేదు. రామరాయ లూరలేదు చంద్రలేఖ యుండినచో కొంత తృప్తిగ నుండునని యే తలంచినదో గాని ఆమె కొఱకు చెప్పి పంపినది. ఆమె గ్రామాంతరము వెళ్ళినదని తెలిసికొన్నది. మరల చాల కాలమునకు—దాదాపు నాలుగు మాసాలకు- ఈనాడు చంద్రలేఖ దర్శనమైనది. చంద్రలేఖను చూడగానే తిరుమలాంబిక గట్టిగా కౌగిలించుకొని కపోలములను ముద్దిడుకొన్నది. ఆమె కపోల స్పర్శ చంద్రలేఖ కెంతో ఆనందపారవశ్యమును ప్రసాదించినది.

"అబ్బా! ఎన్నాళ్ళు నీకోస మొగము వాచితిని చంద్రా! ఇన్నాళ్ళెక్కడ నుంటివి?" అని తిరుమలాంబిక తమకముతో ప్రశ్నించినది. అందుకు జవాబుగా—

"ఆత్మబంధువులయింట" అని చంద్రలేఖ అన్నది.

"శరీరము బాగుగ చిక్కినట్లున్నది?"

"నిన్ననేగదా యీ యూరు చేరితిని. ప్రయాణపు బడలిక"

"చూచితివా సఖీ! సలకముతిమ్మయ దౌష్ట్యములు! నాభర్తనుచంపి ప నెన్నియో మాయోపాయములు పన్నినాడు! కడపటికి దేవుడే మనపక్షమైనాడు"

"ఏమయినది? రామరాయమహామంత్రియెడ అంతద్రోహమా! ఏమయినది?"

"జంజీకోటనాయకుడు తిరుగబడినాడు. అదిగూడ సలకము తిమ్మయ సలహాపైననే యని తరువాత తెలిసినది. వానిని

సైన్యములతో అటుబంపి వెంటనే వారిపైకి గొప్ప సైన్యములతో కొంతమంది దుర్గాధిపతుల పంపినాడు. అచట రామరాయ ప్రభువు తనరాజధాని ప్రవేశించి భేదోపాయముచేత రామచంద్రనాయక నరసింహానాయకుల విడదీసి, రామచంద్ర నాయకుని బంధీకృతుంజేసి నరసింహానాయకుని సహాయము చేత వారిసేనలు గూడ వెరసి కలవగా నయిన బృహత్సేనతో తిమ్మయసైన్యములపై బడిహోరాహోరిగపోరాడికడకు దాదాపు నెలకు జయముగొనినాడు. తిమ్మయసైన్యము నుపంపుచున్న రహస్యము నెవడో కోమలాంగుడు- ఒక యువకుడు తెలిసికొనెనట! అతడే మన ప్రభువున కంగరక్షకుడుగ నుండెనట! తర్వాత ఒకరాత్రి ఆదవాని దుర్గాధిపతి అర్వీటికోన దేవరాజు నిద్రించుచున్న మహామంత్రిని నఱుకబోయెనట! ఆ యువకుడు వానిని సంహరించెనట! ఇన్ని కష్టముల పడి కడకు రామరాయ ప్రభువు వచ్చుచున్నాడు! ఇంతటితో నయినదా? తిమ్మరాజు మాపినతండ్రి అచ్యుతరాయలను చంపించినాడు. పిల్లవానిని రాజునుచేసి పాలన కైవసము చేసికొన్నాడు. ప్రభుత్వోద్యోగులకు- దుర్గాధిపతులకు- ఆశలుపెట్టి తనవైపు త్రిప్పుకొన్నాడు. మఱది తిరుమలరాయలనుండి సర్వసేనాధిపత్యము లాగికొన్నాడు. జయావహుడై వచ్చుచున్న రామరాయప్రభువును దారిలోనే బంధింప ప్రయత్నముల చేయుచున్నాడు. వారికీనగరమున పురస్కారమే లేకుండ చేయవలయు నని కట్టుదిట్టములు చేయుచున్నాడు. వరదాంబికి

మొదట తిమ్మరాజున కెన్నివిధములుగనో సహాయము చేసె నది. తనభర్త మృతి కతడే కారకుడని సూచాయగ విని అప్పటినుండియు నంతశ్రద్ధ చూపుట లేదు. ఈ విషయముల నన్నిటిని హర్తాహరునిచే వారికి చెప్పిపంపితిని.''

''మంచిపని చేసితివి. ఇక మనము నిశ్చింతగ నుండ వచ్చును. మిగిలిన పనులన్నియు వారే చూచుకొనగల సమర్థులు! అయిన రాజకుమారీ! ఆ విధముగ సహాయము గావించిన యువకు డెవడట! ఈ విజయనగర వాసియేనా?''

''అయి యుండనోపు! అబ్బా! ఎంత సాహసము గావించి నాడు! ఆ యువకుడు కనబడెనా, ఏమికోరిన నీయగలను.''

''ఏమికోరినను ఒసగగలవా?'' చంద్రలేఖ నవ్వుచు నన్నది.

''ఏమికోరగలడు? వీరాధివీరుడు రామరాయమహామంత్రి సతీమణి నుండి ఏమికోరదగునో అదియే కోరగలడు. కోరిన దానిని మన మీయగలము.''

''బాగుగ బడలియున్నాను రాకుమారీ! నేటికి పోగునా?'' తిరుమలాంబిక సెలవొసగినది. చంద్రలేఖ యేదో ఆలోచించు కొనుచు వెళ్ళిపోయినది.

## 11

రామరాయల సైన్యములు పెనుగొండ జేరినవి. లేపాక్షిశిల్పులు వీరణ్ణాచారియును, ఆతనితమ్ముడును రాయల

వారి కాఠిన్యము నెఱపిరి. కళాపోషకుడు రామరాయమహా మంత్రి కొన్ని గ్రామమ్ము లా దేవాలయమునకు దాన మొసగి నాడు.

సరిగా మూడు వారముల యనంతర మాయువకుడు మరల రాయల కంట వడినాడు. రాయలు చేతులుచాచి ఆహ్వానించినాడు. ఆ యువకుడు కొంచెము వెనుకకు జరిగి నమస్కరించి "ప్రభూ! ఒక మనవి! మీరీసైన్యములతో పాటు పయనింపవలదు. నా వెంట వచ్చి పురప్రవేశము గావింప వలయు" ననెను.

"ఏమీ! అపాయమా? ఇక అపాయ మేమున్నది?"

"అది మీరడుగవలదు. నాప్రార్థన మన్నించి నేనిచ్చిన దుస్తుల ధరించి నా వెంట రావలయును"

"నీ వెవరో చెప్పలేదు గదా!"

"అంతయు దారిలో చెప్పెద రండు"

వెంటనే వ్యాపారి వేషము వేసికొని రామరాయ లాయువకుని వెంబడించెను. మరునాడు చీకటి పడు సమయ మున పురద్వారమును తప్పించి వేరొక మార్గమున తుంగ భద్రానదిని దాటినారు. దాటగనే రామరాయలు ప్రతిదినము గూర్చుండు స్థలము గనబడినది. అడుగున పడిన స్మృతులు స్ఫురణకు వచ్చినవి. తీయని భావాలు హృదయసీమాంతర మందు రేగినవి. అశ్వముల నధిరోహించి కొంతసేపు సైకత స్థలిని విశ్రమించిరి.

అదే సమయమున పెనుగొండలో విశ్రమించి యున్న రామరాయలసైన్యముపై క్రొత్తగ పంపింపబడిన తిమ్మరాజు సైన్యము పడినది. నిరాయుధులుగనున్న సైన్యముపై బడి ముఖ్యుల నెల్ల బందీల గావించిరి. వెంకటపతిరాయలు బందీ యైనాడు. రామరాయలకోసము గాలించినారు. విఫలీకృతులై విరుప్పణ్ణాచారి నడిగినారు. రామరాయల యుదంతము తనకు తెలియదని మొఱపెట్టినను వినక యాతనిని చిత్రవధచేసినారు అడ్డు వచ్చిన యాతని తమ్ముని గూడ కఱకుకత్తుల కెఱజేసి నారు బందీలను నడిపించు కొనుచు విజయనగరమునకు పయనమైనారు.

రామరాయ లేనాటి నుండియో తుంగభద్ర నీటిని త్రాగుచునే యున్నాడు. కాని తానీనాడు తన రెండుహస్తము లతో నీటినెత్తి త్రాగి దప్పి తీర్చు కొన్నపుడు దాని తీయందన మునకాశ్చర్యపడినాడు. ఆనందపడినాడు. "గంగాస్నానమ్ తుంగపానమ్" అన్న సామెతకు సార్థక్య మానా డాతనికి తోచినది.

యువకుడు లేచి రామరాయల లెమ్మన్నాడు. ఇరు వురు బయలుదేరినారు. రజకవీథిలో ప్రవేశించినారు. కొం డోజీ భవనమును సమీపించినారు. యువకుడు వాహనము దిగిరామరాయలను దిగుమని సంజ్ఞచేసినాడు. రామరాయలు యంత్రమువలె దిగినాడు. ద్వారబంధము దాటి యువకుడు వంకరలు విరిగి యైన్యాచముగ నమస్కరించి "రండి" అనుచు

లోనికి దూరినాడు తళుక్కున మెఱసినట్లయినది. రామరాయల స్మృతిలో నేదో సత్యము మెఱసినట్లయినది. దూసికొని ముందున కుఱికినాడు. పరుగిడుచున్న యువకుని తరిమినాడు. అప్పటికి చంద్రలేఖ గదిని సమీపించినాడా యువకుడు. గదిలో ప్రవేశించుచుండగ పట్టుకొన్నాడు రామరాయలు. పెనుగులాటలో ప్రతిశీర్షము పడిపోయినది. సత్యము బయట పడినది. రామరాయలు గాఢముగ హృదయమునకు హత్తుకొన్నాడు. హత్తుకొని ఆనందాశ్రువులు జలజల రాల్చినాడు. ఆ బాష్పములు తనచేతితో తుడుచుచు చంద్రలేఖ ఆతని చేతులలో - ఆనంద డోలికలలో ఊయల లూగినది.

చంద్రలేఖా రామరాయల ప్రణయ సమాచారము కొండోజీని మురిపింపఁ జేసినది. రాజనగరములో జరుగుచున్న సమాచారముల సన్నివేశము తెలిసికొనుటకు కొండోజీ నివేదించినాడు. సన్నని చెవిన వార్త:- "[illegible] సైన్యము పెనుగొండలో విశ్రాంతి గైకొనుచున్న సైనికులపై చీకటి రాత్రి పడి ముఖ్యుల సందడిసు బందిలను గావించుట-సైన్యములన్నియు తిరుగుముఖమై ప్రస్తుతము విజయనగరమునకు మున్నూఱు క్రోసుల దూరములో నుండుట" ఇది విని రామరాయలు కరుణతో-కోపముతో-నిండి మండిపడినాడు. తిరుమలరాయలఁ బిలిపించి తమస్వాధీన ముననున్న సైన్యముతో వెంటనే వెడలవలయునని యాజ్ఞాపించినాడు. మరునాడు సాయంకాలము నాగలాపురమునకు ఉత్తరమున రెండు మైళ్ళ

దూరాన పోరు ఘోరముగ సాగినది. బందీల బంధములు త్రెంచివేయుట జరిగినది. వెంకటపతిరాయలు మరల విజృంభించినాడు. తిమ్మరాజ సైన్యములు చాలభాగము తుత్తుమురై పోయినవి. మిగిలినవి చెల్లాచెదరై చెట్టుకొకడు పుట్టకొకడుగ పాఱిపోయిరి. విజయవంతములై రాయలబలములు నగరము ప్రవేశించినవి.

తిమ్మరాజిఱుకునఁ బడినాడు. రామరాయలు నగరమే ప్రవేశించి సైన్యముల ప్రోగుచేసికొని యుద్ధమున కేగినాడు. వెనుక వెనుక తాను సైన్యము పంపినచో వారిని గూడ తఱిగి రామరాయలు తన్నుతప్పక శిక్షించునని తిమ్మరాజూహించినాడు. ఇది యదను గాదని పెనుగొండయందు జయము గొన్న సైన్యమునకు తిరుగుబాటు సైన్యమని నామకరణమొనర్చిదానినోర్చినందులకు రామరాయుల కభినందనలు పంపించినాడు.

రామరాయలు వెంటనే తిమ్మరాజును శిక్షించుటకు పూనుకొనలేదు. సామంతుల నెందఱనో యాశలు జూపి యాతడు లోబఱచుకొని యుండుట రామరాయ లెఱుగును. ఎందరో దండనాథులకును పాళెగాండ్రకును ఆశలు చూపి లోబఱచుకొని యున్నాడు. శ్రీకృష్ణదేవరాయల కాలములో నమ్మిన బంట్లనిపించుకొన్న దండనాథులు సైత మాశాపరులై తిమ్మరాజుపక్షమవలంబించి యున్నారు. రామరాయలూరలేని సమయమున నెన్ని కూటములు జరిగినవో బాగుగ

పరిశీలింపవలసినదే రామరాయ లెట్టినిర్ధారణకును రాలేం. సలకము తిమ్మయ యిపుడు రాజగు చినవెంకట్రాదికి మేనమామ. రాజమాత వరదాంబిక యన్న. వారియపుడు నాతని పక్షమై యుండుట సహజము. వారి కిష్టుడైన యాతని శిక్షించినచో వారి కిష్టముండక పోవచ్చును. అట్టితటి వారిని గూడ కాదన వలసి వచ్చును. అది రాజద్రోహ మగును. వారి రాజ్యమును దురాక్రమణ గావించి నట్లగును. విజయనగ రాంధ్రచక్ర వర్తుల వంశమునకే ద్రోహాము గావించి నట్లగును. ఇన్నిశంక లచే రామరాయలు తిమ్మయను శిక్షించుటకు వెంటనే పూను కొనక కుట్రల పరిశోధింప వలెనని పూనుకొన్నాడు.

# 12

చాకలికన్నా! సంఘములో నెంత నీచస్థానము! సంఘ మెంత కృతఘ్నమైనది! మానవు డెంతవిచిత్రజీవి! శాసనము లకు లొంగునట్లు సద్బోధనలకు లొంగడు! ప్రేమింపని వారి వెంట దగిలినట్లు ప్రేమించిన వారి ననుసరింపడు! ధనవంతుల గౌరవించినట్లు ధనహీనుల గౌరవింపడు! తనశ్రేయస్సుకోస రము పాటుపడు వారిని గౌరవింపడు! తనకు సేవజేయు వారిని దయతో జూడడు. తన గౌరవమునకును పరిశుభ్రతకును కారణభూతులైన వారికి కృతజ్ఞుడు గాడు. అట్లగుచో మన బట్టల మురికిని శ్రమించి పోగొట్టి-రాత్రులు మాత్రము మన మిచ్చు పిడికెడన్నమునకును, ఏనాడో పంటపండినపుడు

ఒకటో-రెండో-మూపుల మేరకును తృప్తిపడి - మనబట్టల మురికిని బయటికి వెడలగొట్టి శుభ్రము చేసి మనల పరిశుద్ధులనిపింప జేయు చాకలికి మనమెంత కృతజ్ఞులుగ నుండవలయును ! కాకున్న మనబట్టల మనమే యుదికికొనవలయును లేకున్న చీరపోతులు పడి చచ్చిపోవుదుము !

చంద్రలేఖ ! పేరెంతమనోహరముగ నున్నది ! ఆపేరు విన్నపుడు రామరాయ లెంత ముచ్చట పడినాడు ! ఆ లావణ్యమునకెంత మురిసిపోయినాడు ! ఆమె సాహసమునకు, సమయోచిత ప్రజ్ఞకు, ఎంత అబ్బురపడినాడు ! ఆమె ప్రేమభావమున కెంతకృతజ్ఞతాపూరిత మనస్కుడైనాడు !

రామరాయలు చంద్రలేఖకు పూర్తిగ మనసిచ్చినాడు ! నిన్ననే మాట యిచ్చినాడు. వివాహమాడ సంసిద్ధుడైనాడు. ఆవిషయమును ఆస్థానపురోహితునికి చెప్పి పంపినాడు. తదితర ముఖ్యుల కావిషయము తెలియజేయబడెను. ఎంతప్రతిఘటన! ఎంతనిరసన !

ఆస్థానపురోహితుడు తాతాచార్యులకు చంద్రలేఖ శిష్యురాలు. రాజకన్యలతో చేరి చదువుచుండినను ఆమెకు సమమర్యాదనిచ్చిన వాడు గాడు. చాకలికి-అందులో చాకలి కన్నెకు- చదువా అన్న ధోరణి వాడు. చంద్రలేఖ సత్ప్రవర్తనగూడ ఆతని మనసులో పరివర్తన తేసికొని రాలేక పోయినది. సాంఘిక దృష్టిని మార్చుకొనవలసిన అవసరమాతనికి కనగలేదు. ఆతడు ఉదారుడు గాడు. సంఘసంస్కర్త

కాడు. సవర్ణములున్న వాడు గాడు. తాను నమ్మిన వానిని గూడ ఆచరించు వాడు గాడు. బాధించు దంతకంటు గాడు. మరి అతనికి సంస్కారభావము లేలకలుగును? చంద్రలేఖా రామరాయల సంబంధ విషయము వినగానే అతడు చెవుల మూసికొన్నాడు. మనసులో వికారము బయలు దేరినది. కడుపులో చేయిపెట్టి కెలికినట్లయినది. వెంటనే రాయల గృహమునకు బయలుదేరినాడు.

రామరాయమహామంత్రి-కొండోజీ, రామయామాత్య తోడరమల్లు, మొదలుగాగల సచివపరివేష్టితుడై యున్నాడు. వివాహవిషయమునయే చర్చ జరుగుచున్నది. తాతాచార్యులు ప్రత్యక్షము కాగానే చర్చ ఆగిపోయినది. ఆచార్యుల వారు దూసికొని వచ్చి "ఎంత అన్యాయ్యము! ఎంత అన్యాయ్యము!" అనుచు ఆసనముపై చదికిలబడి నుదుట చెమట దుడుచుకొనుచు పైపంచెతో విసరుకొనుచు కూర్చొని రామరాయలపై తీక్ష్ణదృష్టిపఱపి సమావేశ సభ్యుల నొకపరి పరికించినాడు "అన్యాయమేమున్నది?" అని రామరాయ లందుకొన్నాడు.

"అన్యాయము కాక న్యాయమా?"

"అన్యాయ మేమున్నది?"

"రాజవంశోద్భవుడు రజక కన్యను వివాహమాడుట న్యాయమా?"

"ఏల యూడరాదు?"

"ఉచ్చనీచములు లేవా?"

"అవి మనము తెచ్చిపెట్టుకొన్నవి కావా?"

"మనము తెచ్చి పెట్టుకొంటిమా?"

"మరెవరు?"

"మనపెద్ద లేర్పరచిన సంప్రదాయమది"

"నేనన్నది గూడ నదే!"

"సంప్రదాయమునకు విరుద్ధముగ ప్రవర్తింతురా?"

"ఇది విరుద్ధము కాదే?"

"విరుద్ధ మేల గాదు? క్షత్రియునకు గజకకన్యతో వివాహమా?"

"క్షత్రియుడు ఎవరినైన పెండ్లియాడ నచ్చునని సంప్రదాయమున్నదిగదా!"

"అది యేనాటిదో!"

"మరి మీ కేనాటిది గావలయును?"

"ప్రస్తుతము సంఘమునగల శిష్టాచారము"

"శిష్టాచారమేది?"

"శిష్టు లాచరించునది"

"శిష్టు లెట్టివారు?"

తాతాచార్యులకు కోపము వచ్చినది. దానిని ప్రదర్శించుటకు గుండెలు చాలలేదు. లోలోపల మండుచున్నారు. ఇంతలో రామయామాత్యుడొడరమల్లు కల్పించుకొని,

"తాతాచార్యా! తమబోంట్లుగదా శిష్టులు!" అన్నాడు.

"........."

"అగ్రహారీకులును- రాజకీయోద్యోగులును- ఇట్టివారందఱును శిష్టులు గదా!"

"అవును"

"తాతాచార్యా! మీ అగ్రహారిక లెట్టిశీలవతులో తెలియని దెవరికి! అక్కడలేని వ్యభిచారము - త్రాగుడు - జూదము - మరొక చోట నున్నవా?"

తాతాచార్యులు ఉడికి పోయినాడు. పైనబడు మృగమువలె రొప్పుచు "అది మీ నియోగబృందమునకు చెల్లును. మా పురోహిత వర్గము అంత నీచతకు దిగలేదు," అన్నాడు. "అవునాచార్యా అవును! నేను చెప్పుచున్న విషయము పవిత్రమైన పురోహితుల గుఱించియే!" అని నవ్వినాడు. ఇంతలో కొండోజీ కల్పించుకొని "ఆచార్యా! మీ పురోహితులలోనే యెందఱను చూపుమందువు? వితంతువుల భ్రూణహత్యల పాల్పడజేసిన పురోహితపుంగవుల నెందఱ జూపుమందువు?" అని సూటిగా నాతని నేత్రములలోనికి చూచినాడు. ఆ మాట వినగానే తాతాచార్యులు గుమ్మడికాయల దొంగవలె చల్లనైనాడు. తాతాచార్యుల వెంట వచ్చిన కవి, నరనాథడింఢిముడు కల్పించుకొన్నాడు.

"సంఘములో కక్కుర్తికై అరుదుగ జరుగు దురాచారములు ఆచరణీయములని యేల భావింపవలయును? దుష్కృత్యహర్త

బలము వల్ల తక్కర్తికోసరము విధవతో చెలిమిచేసినచో దానిని వివాహ మాడు మందురా? నీచజాతిస్త్రీతో చెలిమి గలిగినచో దానిని వివాహ మాడు మందురా?''

నరనాథడిండిమునన్న యీ పలుకులకు రామయామాత్యుడు జవాబీయ నుకించు చుండగా కొండోజీ యడ్డుపడి ''నరనాథా! అట్టిగప్పును చేసినవా రేజాతివా రగుదురు?'' అన్నాడు.

''కొండోజీ! పొరపాటునకును స్వభావమునకును భేదము తెలియక నీవారు తిరుమలి ఉన్నతజాతులు పొరపాట్లు చేయుచో అది వారి జాతికి కళంకము గాదు. నీచజాతులు స్వభావము చేతనే అట్టిపనులు చేయుచుందురు.''

''ఒకే నీచపుబనిని తప్పని తెలిసికూడ-చేయుచు పోయిననో అది పొరపాటందుమా, స్వభావమందుమా?''

''దానిని స్వభావ మనము, లెక్క-చేయుట తన మందుము.''

''అందరియెడల నట్లే యేల భావింపరాదు?''

రామరాయ లీసంభాషణమును వినుచున్నకొలది-లోపల బాధయును - కోపమును - అతిశయింప జొచ్చినవి. రామరాయలు కోపస్వభావము కలవాడే గాని సమయాసమయముల నెఱిగి మాట్లాడు సంస్కారము గలవాడు. ఎదుటివానిని పరుషవచనములతో నొప్పింపక యే, మంచిమాటలతోనే యొప్పించును. రామరాయలు కల్పించుకొని——

''నరనాథా! వివాదములో పసలేదు. జాతినిబట్టి స్వభావము నిరూపింప తెలివైన పనిగాదు. స్వభావమనగాపుట్టుకతో

వచ్చునది. అది మనతోఁ బాటు పెరుగుచున్నదేగాని సామాన్య
ముగా వదలదు. బలీయమైన సంస్కారము వల్ల కొంతవఱకు
దాని ప్రాబల్యమును తగ్గింపగలము! హెచ్చింపగలము! స్వభా
వము కేవలము వైయక్తికము! జాతికంతయు నొకే స్వభావ
ముండుననుకొనుట యవివేకము. ఆచారసంప్రదాయాది విష
యములలో ఏకత యుండవచ్చును అంతేగాని స్వభావములో
గాదు. వాతావరణప్రాబల్యము వలన జాతియొక్క ఆచార
సంప్రదాయాదు లలవడుటకు వీలున్నది. పెరుగునట్టి వాతా
వరణము ఆ జీవియొక్క శీలసంపదను కూర్చుటలోగాని -
పెంచుటలోగాని- మిక్కిలి ప్రాధాన్యము వహించు చున్నది.
కవివైన నీకు పుట్టినబిడ్డకూడ మన కెవరికిని తెలియకుండ ఒక
ఆటవిక కుటుంబములో పెరిగిన నో వాడాటవికుడే యగును
గాని చదువునేర్చి సాధారణముగ నాగరికుడు కాలేక పో
వచ్చును! నీకు చేతగాని పను లెన్నియో చేయుగలడు. నీవు
తినని వెన్నియో తినగలడు! అవి యేల యబ్బినవి? పెరిగిన
వాతావరణ ప్రాబల్యమువల్ల. ఒక ఆటవిక జాతిలో పుట్టిన
బిడ్డను నీకుగాని - నీయింట నెవరికిగాని తెలియకుండ -
నీయింట వదలినా రనుకొందము. ఆబిడ్డ మీబిడ్డగాదని
తెలియదనుకొందము. మీయింటి వాతావరణములో పెరిగిన
ఆ బిడ్డడు చదువుసంధ్యలునేర్చి మీ యాచార సంప్రదాయా
దులు గలిగి యుండును. కొన్ని గుణములు పుట్టుకతో రాక
మానవు. అవికూడ పెరుగునట్టి వాతావరణమునకును సంఘ

వాతావరణమునకును లోబడి, మారుటగాని - పెరుగుటగాని - సంభవించును. ఇందువలన పుట్టుక కెట్టి ప్రాధాన్యము కూడ లేదు. పుట్టుకతో అందరును సమానులే. అందఱకును మెదడు బలము మొదలగునవి సామాన్యముగ సమానమే! వచ్చిన భేద మంతయు పెరుగుటలోనే! సంఘపుకట్టుబాట్లకు లోనై పెరుగుచున్న జీవి - కొన్ని యెడల అనుకూలత లకును లోనై మఱికొన్ని యెడల అననుకూలతలకును తదను గుణముగ నీ చోచ్చస్థానముల పొందుచున్నాడు. ఈ సంఘపు కట్టుబాట్లు మనము చేసికొన్నవే. పరాన్నభుక్కులకు ఏనాటికిని దెబ్బ తగులకుండ సంఘసూత్రాములను మనమే తయారు చేసికొన్నాము. ఉన్నతకులు లనబడువారు నీచ కులాలను సృష్టించి, అవి ఉన్నతికి రాకుండగ - ఆర్థికముగ పైకి పెరుగకుండగ - సూత్రాలను మనమే తయారు చేసికొన్నాము. ఎక్కడ పుట్టినవానిని అదే కులమని నిర్ణయించి ఆ వృత్తినే అవలంబింపజేసి ఆ వృత్తిలోనే యుండిపోవునట్లు సూత్రాలను మనమే తయారు చేసికొన్నాము. మనము గల్పించిన కొన్ని వృత్తులలోని వారు ఎంత చేసినను - ఎన్నాళ్ళు చేసినను - ధనవంతులగుటకే వీలు లేదు. చాకలి యెంత చేసినను ధనాఢ్యుడు కాలేడు. మంగలి యెంత చేసినను ధనాఢ్యుడు కాలేడు. కుమ్మరి యెంత చేసినను ధనాఢ్యుడు కాలేడు. మేదరి యెంత చేసినను ధనాఢ్యుడు కాలేడు. మాదిగ యెంత చేసినను ధనాఢ్యుడు కాలేడు. ఇట్టివృత్తు లవలంబించు చున్న వారికి పుట్టినవారి నందే నిలిపి వేయుచు వచ్చితిమి. వారిని

వేరే వ్యాపారాదు లవలంబింప నీయనైతిరి. చదువుకొనుట కంగీకరింపనైతిరి. ఇక సమాన ప్రతిపత్తిలోనికి వచ్చు టెట్లు? ఇటువంటి విషయము లన్నియు పరాన్నభుక్కులైన బ్రాహ్మణుల దుస్సలహాల పాటించి రాచరికము నెఱపుచుండిన దుష్ట రాజులు గావించినారు. "వర్ణాశ్రమధర్మరక్షణాచార్య" ఇత్యాది బిరుదము లంటగట్టి-సూర్యచంద్రాదుల వారి వంశ కర్తలుగ వెదకిపట్టి-తృప్తుల గావించి ఇటువంటి శాసనముల గావింప జేసినారు. ఇకనైన దృష్టి మార్చుకొని సత్యమార్గావలంబులగుట శ్రేయస్కరము.

ఇంతకు మునుపు నీవేదో పొరపాటున జరిగిన దానిని అంతగా పాటించి, విధవను వివాహ మాడ దగునా యని యంటివి. వ్యభిచారమునకు పనికివచ్చిన విధవ వివాహామున కేల పనికిరాదు? అది నీచత గాదా? విద్యాపరు లట్లు చేసినచో సహింప వలసిన దేనా? బలవంతముగనైన యట్టి దురాచారులకు ఆ పితృతువుల నంటగట్టి వివాహము గావింప వలసిన దే! ఇకమీదట అట్టివి జరిగినచో సాక్షులతో గూడ నాదగ్గఱకు కొని తెండు. నేను వారికి వివాహమే శిక్షగా విధింతును. అది మన శాస్త్రసమ్మతము గూడను భర్తమృతి చెందినపుడు అన్యపతిని గ్రహింపనగునని పరాశరస్మృతియందే గలదు. నీచస్త్రీతో సంబంధము తటస్థించునో ఆస్త్రీని వివాహమాడ దగునా యని గూడ నంటివి. స్త్రీవిషయములో జాతిభేదమును పాటింపగూడదని మనశాస్త్రములే తెలుపు చున్నవి. స్త్రీ

యేసంఘములోని వైదిక గ్రన్థము : ఇదే! అది స్వీకార్యమాణము, అని మనుధర్మశాస్త్రము చెప్పుచున్నది. నీచోచ్చతలనగా నేమి? ధనము విషయమున గలదు. విద్య విషయమున గలదు. అంతేగాని పుట్టుకలో గలదా? అందఱును యోనిజులు గదా! అందఱును చచ్చిన తర్వాత మట్టిలో కలియుదురు గదా! అందఱకును ఆ దేగాలి—ఆ దేనీరు – అదే ఆహారము అవసరముగదా!

తాతాచార్యా! ఏది న్యాయమో, ఏది యన్యాయమో ఇకనైన తెలిసికొనుడు. మీ కనుకూలముగ నున్నంత కాలము పూర్వాచారప్రకారము పోవలె నందురు. అవసరము ననుసరించి ప్రాతసూత్రాలకు సవరణల ప్రతిపాదించి సంఘమును మోసముచేయుచు— మీస్థానములకు భంగము వాటిల్లకుండ చూచుకొనుచుందురు. ఇట్టి అన్యాయమున కెప్పుడు గూడ నెదురుకోలు సంభవించుచునే యుండును. బుద్ధమహాత్ముడు జన్మించినాడు. మానవత్వమన నేమో బోధించి మానవులలో సమత్వము – పరస్పరప్రేమ – జీవకారుణ్యము స్థాపించి పోయినాడు ఆ మహనీయునిపై ఈపురోహితసంఘము కత్తి గట్టినది. ఆ మతములో దొంగలవలె కొందఱు ప్రవేశించి—ఆ మతము పేరట దుర్మార్గములు చేసి—దానికి చెడ్డ పేరు తెచ్చి—కడపటికి ఈ దేశములోనే దానికి స్థానము లేకుండ చేసినారు. తరువాత పాశ్చాత్యసంఘమున క్రీస్తుభగవానుడు పుట్టి బుద్ధుని సూత్రముల పాటించి బోధించినాడు. సత్యసం

బంధమైనదియును-ధర్మసంబంధమైనదియును-అయినదే ప్రపంచమున మనుచుండును. దానికి విరుద్ధమైనది అపుడపుడు తల యెత్తినను దెబ్బ తినుచునే యుండును. ఈనాడు మరల మానవసమత్వపు దినములు వచ్చుచున్నవి. ఈ కాలవాహిని కెవ్వరును ఎదురీదలేరు. ఈ ప్రవాహ మంతకంతకు అభివృద్ధియై కొలది శతాబ్దములలో పరిపూర్ణమైన స్వేచ్ఛాస్వాతంత్ర్యములను - సర్వవిషయములలో సమత్వమును వెలయింపగలదు. ఈ సంస్కరణాహోమమునకు నాయీ వివాహ మొక్క సమిధ."

ఇట్లనుచునే రామరాయలు ఆసనముపైనుండి లేచినాడు. అదే గంభీరవదనముతో లోపలి కేగినాడు.

# 13

వివాహ మత్యంతవైభవముగా జరిగినది. పురమునను అంతఃపురమునను అసంఖ్యాకములు దేరినది. పరిస్థితు లవగాహనము చేసికొన్న తిరుమలాంబికయు అంగీకారమును చూపినది. కాని ఈ వివాహమునకు ఉన్నతకులమని భావించువారెల్లరును వ్యతిరేకులు. సామాన్యుల మనుకొను వారును, అధము లనుకొను వారును అనుకూలురు. ఈ తరగలవా రందఱును పై తరగతివారి చేతులలోని వారు. వ్యక్తిత్వము లేనివారు. రామరాయల కనుకూలముగా భావింప గలవారే గాని భావింప సాహసము లేదు. వారినుండి సహకారము లేకపోయినను సద్భావము మాత్రమున్నది.

ఈ వివాహము సాంఘికముగనే కాదు, రాజకీయముగ కూడ గొప్ప సంచలనము లేవదీసినది. రాజవంశీయులలో అసంతృప్తి కలిగినది. దండనాథులలో ఔదాసీన్యము పొడచూపినది. దీనిని అదనుగ ఉపయోగించి చినతిమ్మరాజు అందఱను రామరాయలకు విముఖులుగ చేయదొడగినాడు. తాతాచార్య వరనాథ డిండిముల సాయముతో విజయనగర సంఘము నంతటిని దాదాపు విముఖము గావించినాడు. సంఘమున పలుకుబడిగలవారు చాలమంది ఈ వివాహమును హర్షింపలేదు. రామరాయపక్షమున నుండిన దండనాథుల నందఱకును గూడ విముఖత్వమును బోధించియు ఆశల జూపియు లోబఱచుకొన్నాడు తిమ్మరాజు. వాతావరణము నంతటిని అప్రియముగ మార్చివైచినాడు.

ఈ వైముఖ్యము రామరాయల పట్టుదలను హెచ్చింప జేసినది. తిరుమలాంబిక మేడప్రక్కనే చంద్రలేఖను మేడ గట్టించినాడు. అది విశాలమైన సౌధము. భవనమంతయు చలువరాతి చెక్కడముతోనే తయారు చేయబడినది. శిల్పచాతుర్యము వర్ణనాతీతము. అందలి స్నానఘట్ట మతి రమ్యాకృతి గలిగి యున్నది. శయ్యాగారమున పొదిగిన మణులు విద్యుల్లేఖాకాంతిసదృశమైనవి. అందు పొందించిన దర్పణములు చాల విలువైనవి. అందుండి తిరుమలాంబిక యంతఃపురమునకు భూవివరమార్గము గలదు. ఆ భూవివరమార్గమధ్యమునుండి యిరువైపుల లంబాకార వివరమార్గము లున్నవి. ఈరహస్యమార్గము లతి రహస్యములు.

కొంతకాలము గడచినది. గూఢచారుల సంచారము ప్రబలినది. రామరాయ లేకుణ కెక్కడ నేమి చేయుచుండునో తెలిసికొనుటకు గూఢచారులు జాగరూకులై కనిపెట్టి తిరుగు చున్నారు. వీరిలో రాజవదన యగ్రగణ్య! రాజవదన కొన్ని రహస్యములు కనిపెట్టినది. "సీఘ్ర రహస్యమార్గములదప్ప అన్యమార్గల దిరుగవలదని చెప్పుము." అని తిరుమలాంబికకు సలహాకూడ నిచ్చినది. రామరాయల కొఱకు గూఢచారులు పట్టుదలగ పని చేయు చున్నారని గూడ చెప్పినది. మరికొన్ని రహస్యములగూడ జెప్పినది. తాను తిరుమలాంబిక పక్షమే యని నమ్మించినది.

ఇట్లారుమాసాలు సాగినవి. ఇప్పటికి చినతిమ్మరాజు నకు ధైర్యము వచ్చినది. సైన్యములో చాలభాగమును, దండనాథులలో చాలమందిని తనపక్షము చేసికొ గలిగినాడు ఇక రామరాయల గృహముపైకి దూకి చెఱపట్టినను పట్ట వచ్చు ననుకొన్నాడు. రామరాయల కెదిరించు బలము లేదని నమ్మకము గలిగిన తర్వాత రాజయిన చినవేంకటాద్రి దగ్గ ఱకు వెళ్ళి "రామరాయలను పదవీచ్యుతుని గావింపుము"ని సలహా నిచ్చినాడు. చినవేంకటాద్రి పిన్నవయస్కుడు. అయి నను చాల తెలివి గలవాడు. తనకు మిత్రులెవరో శత్రులెవరో తెలిసికొన్నవాడు. చినతిమ్మరాజన్న తనకంతగ కిట్టదు. కాని తన తల్లిమాట జవదాట నేరని ధర్మచుతావలంబి. తనతండ్రి యొక్క హత్యాన్మరణమునకు చినతిమ్మరాజే కారణభూతుడని

వినియున్నాడు. ఆవిషయమున తనతల్లి గూడ మౌనము వహించు చున్నది. చినతిమ్మరాజుపుత్రుల అదివఱకు విని యున్నాడు. ఇపుడు స్వయముగ చూచు చున్నాడు. తనకును తన సామ్రాజ్యమునకును రక్షణకర్త రామరాయలే యని యతని నమ్మకము. చినతిమ్మరాజు కంటె రామరాయలు ఉన్నతవంశసంజాతుడు. ఉన్నతవంశముతో వివాహసంబంధము గావించు కొన్నవాడు. ఉన్నతుల సలహా శిక్షణలలో పెరిగిన వాడు. వివేకము నార్జించిన వాడు. శౌర్యధైర్యసాహసాదిగుణసంపన్నుడు. వీనికితోడు ఉదారమనస్కుడు.

రామరాయల భయమువల్లనే సలకము చినతిమ్మరాజు తన నింతవఱకు బ్రతుకనిచ్చినాడని వెంకటాద్రి యభిప్రాయము. ఆ యభిప్రాయమును బయటికి పొక్కనిచ్చినచో తనకు తక్షణమే అపాయము. అందుచేత చాల భయమనస్కుడై కాలము పుచ్చుచున్నాడు. రామరాయలపైకి రెండుసారులు తిమ్మరాజు సైన్యముల పంపిన సంగతి అతనికి మొదట తెలియదు. తరువాత తెలిసి బాధ పడినాడు. ఆ విషయము తన తల్లికి తెలియ జేసినాడు. తల్లికి రామరాయలన్న నిష్టము లేదు. తనకొడుకు యొక్క సామ్రాజ్యమును హరించునేమో యన్న భయ మామెకు గలదు. తన్నయన్నయే తనకొడుకు యొక్క సామ్రాజ్యమును కాపాడ గలడని యామెకు నమ్మకము. అందుచేతనే అన్ని వ్యవహారములను అన్న చేతిమీదనే సాగుట కొఱకై ఏర్పాట్లు గావించినది.

వెంకటాద్రిరాయలు చినతిమ్మరాజు సలహా పాటించ లేక పోయినాడు. వానినుండి యపాయము సంభవింప వచ్చునని తెలియక పోలేదు. అందుకని తనయాత్మను చంపుకొని అటువంటి యుత్తరు వీలేక పోయినాడు.

చినతిమ్మరాజు చినవేంకటాద్రి తన చేతిలోనికీలుబొమ్మయని యింతవఱకు తలచినాడు. ఈనాడాతని చర్యజూచి చకితుడైనాడు కాని రేమాత్రముకు అధైర్య పడలేదు. తానుగోరినది రాజుచే నుత్తరువు లిప్పించ వలెనని. అది లభింపని నాడు తానే రామరాయలను తటిమివేయింపగలడు వీలుపడినచో చంపింపగలడు. తనకిప్పు డంత బలమున్నది. విజయనగరసామ్రాజ్య మంతయు తన మాటపై నున్నది. రామరాయలపై విముఖత్వముపుట్టించుట కెన్నియో విధములనెన్ని చోట్లనో నెఱపినాడు. ఈనాడు రామరాయలను రహస్యముగ నెదుర్కొని చంపించినను దక్కులేదని యభిప్రాయ పడినాడు కాబట్టియే చినవేంకటాద్రి తన సలహాను పాటింపనపుడు మనసులో నవ్వుకొన్నాడు.

రామరాయలపై ప్రజానీకములో ఒక విధమగు విముఖత్వము ప్రబలిన మాట నిజమే! అయినప్పటికిని ఆయన యెడ గౌరవభావమును అభిమానమును పూర్తిగ నశించిన దని చినతిమ్మరాజును, ఆతని అనుయాయులును భావించినారు. కొండ్రోజీ తన బలమును కేంద్రీకరించు కొనుచున్నాడు. రామరాయమాహాత్మ్యతోడనున్నట్లు తన పలుకుబడిని బాగుగ విని

యోగించుకొను చున్నాడు. సర్వసేనాధిపతి తిరుమలరాయలు గూడ కొంత సైన్యమును చేతియందుంచుకొనియేయున్నాడు.

## 14

అమావాస్య యొక్క ప్రత్యేకత శ్రావణ భాద్రపద మాసముల లోనే! ఆ శ్రావణామావాస్యనాడు ఆకాశము గూడ మేఘావృతమై యున్నది చీకటి చుట్టును వ్యాపించి కన్ను పొడుచుకొని చూచినను ప్రక్కనున్న వస్తువు కన బడుట దుర్ఘటముగ నున్నది. ఆ సమయమున రామరాయలు అతి జాగరూకతతో సాయుధుడయియే తిరుమలాంబిక యంతః పురమున కేగుచున్నాడు. తిరుమలాంబిక యుద్యానవనము నుండియు చంద్రలేఖ యుద్యానవనము నుండియు నదేసమయ ములో అదే అంతర్మార్గమున వైరి సైనికులు ప్రవేశించినారు. లంబమార్గములనుండి గూడ ప్రవేశించినారు. సరిగా వారటు నుండియు,వీరిటునుండియు వచ్చి మధ్యలోనికవాటమునతిజాగ రూకతతో చిటుకుమనకుండ తెఱచినారు. రామరాయలను మధ్యలో నిరీక్షించు కొన్నారు. చీమచిటుకుమన్నను రామ రాయలు వినగలిగి యున్నాడు. తన కపాయము సంభవించిన దని తత్క్షణమే కనుగొన్నాడు. తానేమో భూవివరచతుష్పథ మున నున్నాడు. ఎదురుగను, కుడి యెడమల నుండి యును వచ్చిన వైరిభటులు ముందే తానేగవలసిన మార్గము నాక్రమించి యున్నారు. ఇక తన కెటుపోవుటకును వీలులేదు.

వెనుక గూడ నడుగుల నడి పినవచ్చినది. ఆ భూమార్గము నాలుగడుగుల వెడల్పును ఎనిమిదడుగుల యెత్తును గలిగి యున్నది. అందు కరవాలము త్రిప్పుట గూడ కష్టము.

ఇపు డెదుటి సైనికులు దివిటీ వెలిగించినారు. ఆ వెలుగులో రామరాయ లంపఱ మొగములు చూచినాడు. క్రొత్తగ తిమ్మరాజును చేరిన యిరువురు యోధులనుజూచి తల పంకించినాడు. అందఱ నుద్దేశించి "మీరు ముందు కదుగిడుచో మీ తలలు మీావిగావు. మీరు వచ్చిన దారినే పొండు" అన్నాడు. ఇంతలో వెనుకనుండిన సైనికులు హఠాత్తుగ పైబడి రామరాయల నిరాయుధు గానించినారు. బంధింతిమని యనుకొనుచుండగా భూమార్గ ద్వారముఖములనుండి యలజడి వినవచ్చినది. భటులు వచ్చి రామరాయమంత్రిసైన్యములు ద్వారము గాచుచుండిన తమసైన్యముల చంపినవనియు ద్వారములనిండ వరిగడ్డి త్రొక్కి అగ్గి క్రుక్కి బిలముల మూసి వేసిరనియు చెప్పినారు వైరి సైనికులెల్లరు భయభ్రాంతు లయినారు. ఇక పైనుండి వచ్చు నూదరవల్ల లోపలి సైన్యములు ఉడికి యుడికి చావవలసినదే! తామందఱును నిశ్శేషమగుట తప్పదని యెల్లరును భయ సంభ్రమాన్వితు లైనారు. కొంచెమునే పటు నిటు కాళ్ళుగాలిన పిల్లులవలె తిరిగి ఎక్కడివా రక్కడ బొమ్మలవలె నిలబడి పోయినారు. ఇంతలో వరిగడ్డి యూదర సమీపింప నొడగినది. అంతకంతకు పొగదట్టమై భరాలై పోయినది. అందఱును ఉక్కిరి బిక్కిరి

యగుచున్నారు. హఠాత్తుగ ఒక ద్వారము తెరువబడినది. అంతకంటె వేగముగ రామరాయు లంతర్మార్గములోనికి లాగ బడినాడు. అంతకంటె హఠాత్తుగ మరల తలుపులు మూసికొన్నవి. చిత్తరువులోని రూపముల వలె అందఱును నిశ్చేష్టులై చూచుచున్నారు. లోపలికి లాగబడిన రామ రాయల హృదయముపై చేయి పడినది. రామరాయల వీపును తనపక్షమున కానించుకొన్న వ్యక్తి "నేను" అనగానే రామ రాయలు హఠాదానందాతి శయమున నావైపు తిరిగి ఆ వ్యక్తిని గాఢాలింగనము చేసినాడు. "నాప్రాణముల రెండవ పర్యాయము కాపాడిన నీకేమి బహుమాన మియ్యగలను చంద్రలేఖా?" అని ముద్దిడుకొన్నాడు.

"ఈ రహస్యమార్గమును నీవు కొట్టించితివా?" అని సాశ్చర్యముగ నడిగినాడు చంద్రలేఖ గుండె యెంత తీవ్రముగ కొట్టుకొనుచున్నదో రామరాయుల గుండె యంత నిబ్బరముగ నున్నది. తొందరపాటు సూచించు గొంతుకతో "అన్ని విష ములగుఱించి తర్వాత ముచ్చటించుకొన వచ్చును. ప్రస్తు తము పరుగిడుడు." అని చేయి లాగినది. అగత్యాగోచరముగ రామరాయలు సత్వరముగ నామె వెంట నడిచినాడు. ద్వార ముఖమున, సన్నిన రెండు ధవళాశ్వములు నిలిచి యున్నవి. ఒక్కదాని నెక్కుమని యువకవేషముననున్న చంద్రలేఖ కోరినది. తత్క్షణమే వారు తుంగభద్రానదీతీరమును చేరినారు. రామరాయు లనుదినము సంధ్యావందన మాచరించు స్థలమునకే

చేరినారు. అశ్వావరోహము గావించి కూర్చున్నారు. చంద్ర లేఖ దీర్ఘముగ నుచ్ఛ్వాసము గావించి "ప్రస్తుతము గండము తప్పించుకొన్నాము. ఇక రెండునిమిషములలో మరి యిక్కడ నుండి వెళ్ళి పోవలసియున్నది" అన్నది.

"అది నాకు తెలియుచునే యున్నది. ఇంతకును యేమి జరిగినది?" అని రాయలవా రడిగినారు.

"రాజవనన మన రహస్య మార్గముల కనిపెట్టిన దన్నంతవఱకు మీకు తెలిసియే యున్నది. పఠాణాన సైన సైన్యములను పంపును అనినేను కడు జాగరూకతతో కనిపెట్టి యుంటిని. నాలుగు దినాలవా డేమియును జరుగలేదు. దాని రహస్యపు సంచారమును నేను కనిపెట్టితినని దానికి తెలియుటే యిందుకు కారణము. అందుకే నాలుగుదినములుగ మీరు భూమార్గముల సంచరించుట కిష్టపడనిది గూడ రాత్రి మీ రటు వెళ్ళిరో లేదో మన యుద్యానవనద్వారము పైకెత్తి సైనికులు దిగుట కనిపెట్టితిని. నేనిదివఱకు పన్నిన వ్యూహము ప్రకారము తటాలున రహస్యమార్గముల నాలుగుముఖములను పరీక్షింప సైనికులను పంపి వానిద్వారాగూడ సైనికులు లోని కేగి యుండుట తెలిసికొంటిని. వెంటనే సైనికులను లోనికి దిగవలదనియు, ద్వారముఖముల నుండి పైకి వచ్చువారిని మాత్రము నఱుకవలసిన దనియు, కొందఱు మాత్రము బిల మార్గముఖముననుండి మిగిలినవారు చుట్టపట్లనున్న చెట్ల నడుమ నాగి యుండవలసినదనియు, పైరిసైనికుల జట్టు మరి

సొముకటి వచ్చినపుడు తగుల వలసినదనియు, నా దేశించితిని. వెంటనే బిలముఖముల వరిగడ్డితో దట్టముగ త్రొక్కి రగులబెట్టి యాదర బెట్టుడనియు నాజ్ఞాపించితిని. నేను కొంతమందితో మన తోటలోని బిలమార్గ ముఖమునకు పోగా బిరబిర నడచి పోవుచున్న రాజవదన కనుపించినది. ఆమెను పట్టి నాప్రాసాదములో బంధించుమని యాజ్ఞాపించి ఈ నూత్న బిలమార్గమున లోనికేతెంచితిని. బిల మార్గ చతుష్పథము నానియున్న ద్వారమున చెవియొగ్గి వింటిని. అప్పటికి బిలముఖముల నుండి యూదర వచ్చిన దేమో-- లోని సైనికులెల్లరు ఉక్కిరిబిక్కిరి యగుచున్నారు. నేను కొంచెముగ ద్వారము తెఱచి చూచితిని. అందఱును చిత్తరువులోవలె నున్నారు. కాగడావెలుగున భయభ్రాంతులై యున్న యందఱ మొగములు జూచితిని. మీరు మాత్రము నిర్భయులై నాద్వారము నొద్దనే నిలబడి యున్నారు. తటాలున మిమ్ముల లాగి ద్వారబంధము గావించితిని. తర్వాత తలుపును పగులగొట్ట ప్రయత్నించిన ధ్వనులు వినిపించినవి."

"ఈ బిలమార్గము నెపుడు త్రవ్వించితివి?"

"మనరహస్యమార్గములు రాజవదన కనిపెట్టిన తర్వాత"

"అనగా నయిదు దినములలోనే!"

"అయిదుదినములు తక్కువకాలమా ప్రభూ?"

"చంద్రలేఖా! రాజకీయవిషయములలో నీ మేధాశక్తి యమోఘముగ పనిచేయుచున్నది. నీ సాయమున నేనెన్ని ఘనకార్యములనైన చేయగలను"

"అది మీ యుదారస్వభావము! రాజా! మీ రిటనుండి తక్షణమే పోవలయును."

"ఎక్కడికి పోవలయునా యని యోచించుచున్నాను."

"మీరు ముందుగ కందనోలుకు వెళ్ళవలయును. ఆతర్వాత మిగిలిన విషయముల చూచుకొనవచ్చును."

"మనము పారిపోయితిమని భావింతురేమో!"

"రాజకీయపు టెత్తుల నేను మీకు నేర్పగలనా మహారాజా! సహాయము కొఱకు పోవుచున్నారు. బలమును వెంట తీసికొనివచ్చిన గదా తిమ్మయను లొంగదీయుట! మీరిపుడు వెంటనే కందనోలుకు వెళ్ళవలసి యున్నది."

# 15

రామరాయలు తుంగభద్రను దాటినాడు. ఊరగవని కించుక దూరాన కొంద అశ్వికు లుంట గమని చికత్తిచూసి జాగ్రత్తగ గుఱ్ఱముచు నడిపించుకొనుచు వచ్చుచున్నాడు. తాను వారిని సమీపించుచున్నను వారిలో సంచలనము కనబడలేదు. తనను వారు గమనించుచున్నారు. వారిని మించి ముందుకు సాగినచో వెనుకనుండి తరుముదురేమో యని భావించి గుఱ్ఱముచు నిలిపినాడు. ధీరగంభీరస్వరముతో "ఎవరక్కడ" యన్నాడు. "రామరాయప్రభూ! మేము, మీ తమ్ములును నేనును -. అన్న రామయామాత్యు తోడర మల్లు కంఠధ్వని వినిపించినది. రామరాయు లత్యంతానంద

ముతో వారిని సమీపించి "మీరెట్లిక్కడికి రాగలిగితిరి?" అని ప్రశ్నించినాడు. "మీరే ఇక్కడ కలిసి కొమ్మన్నారని మాకు వర్తమానము వచ్చినది. అదేగాక, మన మందఱ మును కందనోలుకు వెళ్ళవలసి యున్నదని మీ వార్తగ మాకువార్త."

రామరాయ లాయాజ్ఞ నిచ్చియుండలేదు. అది చంద్ర లేఖ నిర్వహించిన ప్రజ్ఞ యని యూహించి నాడు వెంటనే బయలుదేరి తెల్లవారక మునుపే యందఱును కందనోలు చేరినారు. ఆ మఱునాడు సోదరులందఱును రామయామాత్యు నితో కూర్చుండి కర్తవ్యముగూర్చి యాలోచించినారు. తమ బంధువులయిన యావద్దుర్గాధిపతులకును - స్నేహితులకును - విజయనగర సామ్రాజ్యసంక్షేమకాంక్షాపరులును అయిన దుర్గాధిపతులకును-సామంతులకును-పాళెగాండ్రకును- ఒక్కొ క్కరికే, వార్తనంపి పిలిపించినారు. అవసరవిషయము నెల్ల బోధించి తిమ్మయను శిక్షింపవలసిన యవసరమును విశదపఱచి ఉన్ముఖుల గావించినారు.

ఒక్కొక్క సామంతరాజు వేయియేనుగులను, పదివేల గుఱ్ఱములను, ముప్పదివేల పదాతులను- ఒక్కొక్క దుర్గాధి పతియే నూరేనుగులను, అయిదువేల యశ్వములను, ఇరువది వేల పదాతులను-ఒక్కొక్క పాళెగాడు మున్నూ రేనుగులను రెండువేల గుఱ్ఱములను, పదివేల పదాతులను - సమకూర్ప వలయును. వాద్రి యాస్ఫటికె లెక్కప్రకారము పదివేల యేనుగు

లును – లక్షగుఱ్ఱములును - పదిలక్షలకు మించి పదాతులును అయినవి. పై దండయాత్ర యెప్పుడు వెళ్ళవలయునో తరువాత తెలిపెదననియు అందఱును సిద్ధముగ నుండవలయు ననియు రామరాయలు చెప్పి వారి వారి స్థానములకు వారిని పంపి వేసినారు.

# 16

రామరాయలుపిడుగుపగరముసుండియదృశ్యుడైనాడు. తిమ్మరాజు నికే పట్టపగ్గములు లేవు. అతని కత్తి కెదురు లేదు. అతని మాట కెదురు లేదు. రామరాయలు అదృశ్యుడైన రెండవనాడే గొప్ప విందు గావించినాడు. తనకు సహాయము చేసినవారి నందఱను ఆహ్వానించినాడు. వింతవింత పానీయములకై ఆరాత్రికి రాత్రియే పోర్చుగీసువారి కడకు పంపి తెప్పించినాడు. త్రాగి యందఱును తందనాలాడినారు.

తాత్తాచార్యుల కావిందు నచ్చలేదు ఆనాటి ధోరణి యేమాత్రము నచ్చలేదు. రామరాయలు అదృశ్యుడైన యనంతరముగాని ఆయన యావశ్యకత యితనికి బోధపడ లేదు.

రాజయిన చినవేంకటాద్రి ఆవిందులో పాల్గొనక తప్ప లేదు. అతనికావిందు విప్రాయముగ నున్నది. ఆనాటి ధోరణి యేహ్యప్రాయముగ నున్నది. రామరాయల యదృశ్యవార్త మొదట విని చకితుడైనాడు. భయభ్రాంతుడైనాడు.

వరదాంబిక యానందించినది. దాసదాసీజనములకు బహుమానముల పంచినది. ఇక తనకొడుకు ఏకచ్ఛత్రాధిపతి యని తృప్తి పడినది. తనయన్న మహామంత్రియని యానందించినది. తన పలుకుబడికి తిరుగులేదని యుబ్బిపోయినది.

తిరుమలాంబిక తనభర్త యదృశ్యమైనాడని వినగానే యెట్టిమార్పులను కనబఱపలేదు ఆమె కావిషయము ముందే చంద్రలేఖ వలన దెలిసినది. రాజవదనను తలచుకొని మనుష్యుల నమ్ముటే ప్రమాదమని నిర్ధారించుకొన్నది ఇపుడు దనకూటట చంద్రలేఖయే!

రాణీతిరుమలదేవియు, చిన్నాదేవియు అంతగా భయపడలేదు. ఇట్టివి వారికి పరిచయమే! రామరాయల శక్తి వారెఱుగుదురు. అతని శక్తియుక్తులపై వారికి విశ్వాస మున్నది. చిన తిమ్మరాజు త్వరలో శిక్ష పొందగలడని వారి విశ్వాసము.

రామరాయల పక్షీయు లనేకులు చెఱపెట్ట బడిరి. చాలమంది తప్పించు కొనిరి. చంద్రలేఖతండ్రి కొండోజీ బంధితుడైనాడు. మరికొంతమంది దండనాథులు బంధితులైనారు

ఇక చినతిమ్మరాజు తన పరిపాలన మొదలు పెట్టినాడు. రామరాయల పట్టుకొను ప్రయత్నమున కొంత సైన్య ముంచినాడు. చినవేంకటాద్రి రాజుగ నున్నాడన్న విషయము గూడ విస్మరించి తానే రాజుగ శాసింప మొదలిడినాడు.

మొదట తాను చేసినది ప్రజలపై పన్ను లెక్కువ చేయుట! విజయనగరసామ్రాజ్యప్రజ లిప్పటికే తక్కువ కాని

పన్నులు కట్టుచున్నారు. సేనాబల మభివృద్ధి పొందుకొలది, సామాన్యులపై పన్నుభార మధిక మగుచుండును. ఇపుడా భారమునకు తిమ్మరాజు ధనాశ తోడైనది. ప్రజ లాందోళన చెందిరి. పన్నులనుండి మినహాయింప బడిన అగ్రహారికులను గూడ పన్నుల కట్టుమన్నాడు. భూమిని, పంటను, అనుభ వించు చుండి నపుడు పన్నుల కట్టరాదని తిమ్మరాజు వాదించి నాడు. వృత్తిపన్ను గూడ వేసినాడు. రామరాయల పక్షమని భావించిన సామంతుల నధికముగ కప్పము లిమ్మని పీడింప జొచ్చినాడు. బహామనీసుల్తానుల తోడను, పోర్చుగీసువారి తోడను సంధియేర్పాట్లు గావించుకొన్నాడు.

ఈచర్య చాలమంది సామంతులకు నచ్చలేదు. నచ్చని సామంతుల చెఱ పెట్టించినాడు, కొంతమంది కనుగ్రుడ్లు పీకి వేయించినాడు. కొందఱ నంగవికలుల గావించి కారాగార మున త్రోసినాడు. నమ్మించి పిలిపించి యీా విధముగ చేయుట చూచి చాలమంది గర్హించి తిరుగుబాటు లేవదీయు టకు ప్రయత్నము సాగింప మొదలిడినారు.

ఇట్టి దుష్టపరిపాలన దాదా పారుమాసాలు సాగినది. విజయనగరసామ్రాజ్యమునకు గ్రహణము పట్టినట్లు తిమ్మరా జాక్రమించె నని అందఱును భావించినారు ఈ దుష్టగ్రహ మెప్పుడు తొలగునా యని దేవునిప్రార్థింప మొదలిడినారు. లెక్కకు మిక్కిలిగ ధనరాసుల విరజిమ్ముచు ధనాశాపరులగు కొందఱు సామంతులను, కొందఱు దండనాథులను – చేతిలో

నుంచుకొన్నాడు తిమ్మరాజు. రామరాయల వివాహవిషయమున విరక్తుడై తిమ్మరాజుతో చేతులు గలిపిన తాతాచార్య వరనాథడిండిమాది కవిపండితాదులు కొంతమంది యతి విరక్తి జెంది మరల రామరాయల రాకను నిరీక్షింపసాగినారు.

తాతాచార్యాదు లిపుడు తిరుమలాంబికపక్ష మవలంబించినారు. తిరుమలాంబిక చంద్రలేఖ సలహా పాటించి తాతాచార్యాదులచే కొలువుకూటములోని తదితర ముఖ్యులను గూడ తమపక్షమునకు త్రిప్పుకొన నెంత చేయవలయునో యంతయు జేసినది. వీరందఱును రామరాయలను సైన్య సమేతముగ రావలసినదని చెప్పి పంప నిర్ధారించుకొన్నారు. వీరి ప్రయత్నమునకు రాజైన చినవెంకటాద్రి గూడ తోహద మిచ్చినాడు. ఇంతలో తిమ్మరాజు చినవెంకటాద్రిని చెఱపట్టినున్నాడన్న వదంతులు వ్యాపించినవి. ఇదివిని వరదాంబిక గూడ సంచలించి పోయినది. తనయెడ గూడ నిదివఱకు కంటె భిన్నముగ ప్రవర్తించుచున్న తన యన్నను చూచి యిపుడు భయపడ సాగినది. ఇపుడు తన తోడికోడండ్ర యంతఃపురమునకును, తిరుమలాంబిక యంతఃపురమునకును రాకపోకలు సాగింప మొదలిడినది.

ఒకవారము తిరుగక మునుపే పిడుగు వంటి వార్త విన్నది. తన సోదరుడు చినతిమ్మరాజు తన కుమారుని చెఱలో పెట్టించినాడన్నవార్త నగరమునందంతటను పొక్కినది. ఎక్కడుంచెనో జాడమాత్రమును లేదు. వరదాంబిక

గుండె లంపుటిల్లి పోయినది. భూమిపై కాళ్ళూనలేదు. తనకు దిక్కు తోచలేదు. రామరాయలకు చెప్పిపంప మొగము చెల్లలేదు. గత్యంతరములేక అశేషధనమును అరణముగ జూపుచు బీజాపురసుల్తాను సహాయము కోరినది.

# 17

అల్లావుద్దీన్ ఖిల్జి దక్షిణహిందూస్థానమును దోచుకొన్నాడు ఆతర్వాత మహమ్మద్‌బిన్‌తుఘ్లక్ దోచుకొనుటయే గాక దక్షిణదేశమును కొంత ఆక్రమించినాడు. ఆతని సేనాని- గుల్బర్గాపాలకుడు- అబుల్‌మజఫర్ అల్లావుద్దీన్‌బహమన్‌షా (హసన్) అనువాడు స్వతంత్రించి బహమనీరాజ్యమేర్పఱచినాడు. అతని తఱువాత పాలకుడైన మహమ్మద్‌షా విజయనగరపాలకుడైన మొదటి బుక్కరాయలతో యుద్ధమునకు దిగినాడు. విజయనగరముపైబడి నాలుగులక్షల హిందువుల చిత్రవధ గావించినాడు. అప్పటినుండి యీ హిందూ మహమ్మదీయ రాజ్యముల మధ్య పచ్చిగడ్డివేసిన భగ్గున మండుచుండెడిది.

దాదాపు కడపటిసుల్తానైన మూడవ మహమ్మద్‌షా కాలములో ఆతని రాష్ట్రపాలకులు స్వతంత్రించిరి. బీజాపుర పరిపాలకులు ఆదిల్‌షాహీలను పేరుతోడను - అహమ్మద్‌నగరపాలకులు నిజాంషాహీలను పేరుతోడను-బీరార్ పాలకులు ఇమద్‌షాహీలను పేరుతోడను-గోల్కొండపాలకులు కుతుబ్

షాహీలను పేరుకొనెను- స్వతంత్రించిరి. కడపటి బహమనీ సుల్తాను కలీముల్లా బీదర్ పాలకుడుగ నుండెను. అతని యనంతరము బరీద్ షాహీవంశ మట స్థాపిత మాయెను.

మహమ్మదీయ మతాభినివేశమును, రాష్ట్రవిస్తరణ వాంఛయును - విజయనగర బహామినీ రాజ్యముల పరస్పర వైరమునకు కారణములయ్యెను. మొదటినుండి కడపటివరకును వీరికి పోరాటము తప్పనిసరి యయ్యెను. సమయము దొరకిన ఒకరిమెడ నొకరు కోతికి వేయ వలయునని తలంచుచుండిరి. కృష్ణదేవరాయల కాలమున ఈ మహమ్మదీయులు దెబ్బతిన్నట్లు మరెప్పుడును తినలేదు. అప్పటినుండియు విజయనగరముపై నెపుడు పడి ధ్వంసము చేయుదుమా యని యెదురు చూడ మొదలిడినారు.

వరదాంబిక బీజాపూరుసుల్తాను సహాయ మపేక్షించినది. ఆసమయమున సుల్తాను ఇబ్రహీంఆదిల్ షా. బీదర్ పాలకుడు అమీార్ బరీద్ షా. అహమ్మద్ నగరపాలకుడు బురహాన్ నిజాంషా. గోల్కొండపాలకుడు జమ్షీదు కుతుబ్ షా.

వరదాంబిక యాహ్వానమును ఇబ్రహీంఆదిల్ షా అంగీకరించినాడు. తన సేనాపతియైన అసాద్ ఖానుచే ప్రోత్సహితుడై అధిక సైన్యములతో బయలుదేరినాడు. పెలగొండ తిమ్మరాజును పదభ్రష్టునిచేసి విజయనగరసింహాసనము నాక్రమింప వలయునని వాని యుద్దేశ్యము. ఈ యుదంతమును తిమ్మరాజు విని తాను లక్షహొన్నుల ద్రవ్యము నిచ్చెదననియు

ఆ సాయము తనకే చేయవలసినదనియు, వర్తమానము నంపెను. దురాశాపరుడైన ఆ సుల్తాను ఇందుకుగూడ నంగీక రించెను. తిమ్మరాజు వెంటనే గోల్కొండ, బీదర్, అహమ్మద్ నగర పరిపాలకులకుగూడ నెంతో ధనాశజూపి తమతమ సైన్యములతో వచ్చి సహాయము చేయవలసినదని వర్తమాన మంపినాడు. అహమ్మద్ నగరసుల్తానునకును. బీజాపురసుల్తా నునకును వైరము గలదు. అందుచేతనే ఇరువురు గూడ సాయము వచ్చుచో నెవరివల్లగూడ కీడుమూడదని తిమ్మరాజు తలచియే యట్లాహ్వానించినాడు. అందరును ససైన్యులై విజయనగరము చేరిరి. వారి రాకతో విజయనగర మున గగ్గోలు బయలుదేరినది. భయాందోళనములు ప్రజనంతటిని ప్రాకినవి. దర్బారున మహమ్మదీయసుల్తానుల మూర్ఖాటమున కడ్డులేదు. ప్రతివాడును తానే విజయనగర పాలకునిగ భావించినాడు. అల్లుంద్రవలె తినుచు, త్రాగుచు. ఆహ్లాదముగ కాలము గడుపసాగినారు. మహమ్మదీయసైనికుల దుర్మార్గములకు పరిమితిలేదు. విచ్చలవిడిగ సంచరించుచు, వలసినవస్తువుల నెల్ల సంగ్రహించుచు, కనబడిన స్త్రీనెల్ల మానభంగము చేయుచు తమమాటకు మారాడు లేక విహరింప సాగినారు

ఈ లోపల రాజకుటుంబములోననే పరివర్తన గగ్గోలు పుట్టినది. పాలకుడైన చినవేంకటాద్రిని తిమ్మరాజు చంపించి నాడు. వరదాంబిక యేమైనదో యెవరికిని తెలియదు. చంద్ర లేఖ మొన్నటినుండియు కానవచ్చుటలేదు. అచ్యుతరాయ

సోదరుడు రంగరాయలు మొదలగు రాజవంశజులను తిమ్మరాజు చిత్రవధ చేయించినాడు. తానొక మహామ్మారియై విజయనగర రాజవంశము నంతటిని హరించి వేసినాడు. సదాశివరాయలు మాత్రమెట్లో తప్పించుకొని గుత్తికోటలో తల దాచుకొన్నాడు.

తాతాచార్యులును, నరనాథడిండిముడును, దండనాథుల ప్రతినిధులును, మరికొంత మంది పురప్రముఖుల ప్రతినిధులును రామరాయుల దగ్గఱకేగి తిమ్మయ దుండగముల సర్వస్వము నివేదించి తత్క్షణము బయలుదేరుమని కోరిరి. రామరాయలు వెంటనే తా నిదివఱకు ఒప్పందము కుదుర్చుకొని యుండిన దుర్గాధిపతులకును, సామంతులకును, పాళెగాండ్రకును చెప్పిపంపెను. అందఱును వైశాఖశుద్ధదశమి నాడు తిరుపతిలో శ్రీ వెంకటేశ్వరస్వామివారి పాదసన్నిధిని చేరవలసినదనియు, అక్కడ శ్రీశ్రీసదాశివరాయదేవమహారాజుగారికి స్వామివారి పాదసన్నిధిని పట్టాభిషేకము పూర్తి గావించి అక్కడనుండి విజయనగరముచేరి, సలకము తిమ్మయకు బుద్ధిచెప్ప వలెననియు, మరుద్వేగతురంగనాథులచే వర్తమాన మంపెను. వెంటనే మఱికొందఱను, గుత్తిలో తలదాచుకొనియున్న సదాశివరాయుల కడకంపెను. తానును తగినంత బలములతో గుత్తికి పయనించెను.

## 18

వైశాఖశుద్ధదశమినాటి చంద్రకాంతిధావళ్యముతో మలయపవనములు మిళితములైనవి. వీని రెంటికిని ఎగువ

తిరుపతిస్థలౌన్నత్యము మరికొంత చలువను ప్రసాదించినది. తిరుపతికొండపై విశేషించియున్న గంధపు చెట్లనుండి సువాసనలు విరజిమ్ముచున్నవి రామరాయల నాయకత్వము క్రింద తిరుపతి చేరిన ఆంధ్రయోధులు సదాశివరాయపట్టాభిషేకానందము మనసులో ఆనందతరంగముల లేవగొట్టగా పోయిని అనుభవించుచున్నారు. అంతకొలకఘుశీయుకు . పూర్వమే విందు ముగిసినది. ఇపుడు కొన్ని వేడుకలు జరుగుచున్నవి. ఇంతలో సరిగ నర్ధరాత్రియైనది. దేవాలయ ఘంటానాదము వినిపించినది. వెను వెటనే మంగళతూర్యనాదములు సెలరేగినవి. పటహ, భేరీ, కాహళ నినాదములు మిన్నుముట్టినవి. తాతాచార్యాది పురోహిత సమేతులై రామరాయ సదాశివరాయాదులు దేవాలయప్రవేశము గావించిరి. స్వామివారి సన్నిధిని- వేద మంత్రపఠనములమధ్య సదాశివదేవరాయలకు విజయనగర సామ్రాజ్యపట్టాభిషేకము జరిగినది.

జయజయధ్వానములతో బయలుదేరినది సైన్యము. విరామమెఱుగక పయనించుమ పట్టుదలతో పదుమదినములలో విజయనగరమును చేరినది. భేరీభాంకరణములు ప్రకృతిని కంపింప జేసినది.

భేరీనినాదము సలకముతిమ్మరాజు చెవిలో దూరగనే గుండెలు రావియాకువలె కదలి పోయినవి. ధైర్యము చిక్క-బట్టి- మహమ్మదీయ సుల్తానులతో - వారిబలముల సాయముతో - యుద్ధమునకు సిద్ధమైనాడు.

రెండు బలములును ఓహాటించి నిలిచినవి. అటుజూచి నను ఇటుజూచినను సైన్యసాగరములే! విజయనగరసామ్రాజ్యమున లక్షలకొలది బలము లున్నవి. వానికి బహామనీ సుల్తానుల బలములు తోడై మఱింత బలవత్తరము లైనవి. రామరాయలు కూర్చిన అంత సైన్యమును ఆసైన్యమునకు తక్కువే! అయిన నేమి! వీరందఱు యోధులు! పట్టుదలతో వచ్చినవారు! తమ హిందూసామ్రాజ్యమును మహామ్మదీయుల నుండియు, మహామ్మారి తిమ్మయనుండియు విముక్తి గావింప బద్ధకంకణులై యున్నవారలు! మేన ప్రాణముండునందాక పోరాడ దీక్ష గైకొని యున్నారు. ఈసైన్యమువైపు ఒకసారి చూచినాడు తిమ్మయ.

ఎంతసైన్యము!!

ఎంతమంది యోధులు!!!

వీరాధివీరుడు రామరాయలు!!!

భీమార్జునులవంటి తిరుమలరాయ వెంకటాద్రిరాయలు! కృష్ణదేవరాయ దిగ్విజయమునకు కారణభూతుడైనట్టి అవుకు తిమ్మరాజు! వీరాధివీరుడు విఠలరాయలు! సాహసోపేతుడు ఆర్వీటి చినతిమ్మరాజు! ఆదవానిపాలకుడైనట్టి అప్పలరాజు! కొండవీటి పాలకుడు సిద్ధిరాజు తిమ్మరాజు! గండికోట జయ తిమ్మరాజు! మధుర కృష్ణప్పనాయకుడు! జింజీకోట నాయకుడు నరసింహనాయకుడు! ఇంద్రకొండ- గుట్టికొండ- సిద్ధవటము- నంద్యాల - చిట్వేలి-గుత్తి-పొత్తపి- గండికోట- యెట్టిగుంట్ల

కోట - దుర్గాధిపతులు! పొన్నలాపురం హండే హనుమప్ప నాయుడు! పెమ్మసాని యెఱతిమ్మనాయుడు! మసా పెద్దప్ప నాయుడు! వెలుగోటి తిమ్మనాయుడు, అతనికొడుకు తిమ్మప్ప నాయుడు. మఱియు నెందఱో మహాయోధులు!! వీరందఱను చూచి తిమ్మరాజు దిగ్భ్రమ జెందినాడు. మహమ్మదీయసైన్య ము ల గుండెనీరై నది. అయినను సింహనాదములు చేసి యుద్ధము నకు తలపడినారు. హాహాకారిగ పోరాడినారు. పట్టుదల తోడనే పోరాడినారు. మఱింతపట్టుదలతో పోరాడుచున్న రామరాయులసైన్యముల ధాటికోర్వజాలకతిమ్మయ సైన్యము లును - తురకసైన్యములును వెనుకడుగు వేసినవి. తిమ్మరాజు తెగించినాడు. ఘోరముగ వెంకటాద్రితో పోరాడినాడు. తల తెగి నేల కూలినాడు.

సైన్యములు చెల్లాచెదరైనవి. తురకసైన్యములు వెను కకు మరలి పాఱిపోయినవి. వారిని వెంటాడుమని తిరుమల రాయ వెంకటాద్రులకును విఠలరాయలకును ఆజ్ఞాపించినాడు రామరాయలు, కొంతసైన్యముతో తాను సదాశివరాయల తోడ్కొని విజయనగరపురద్వారముచేరినాడు. చంద్ర లేఖయు, తిరుమలాంబికయు, రాణీతిరుమలదేవియు, రాణీ చిన్నాదేవియు పురద్వారముల తెరిపించి రామరాయలకు స్వాగత మొసగిరి. అపుడే కనిపించి చంద్రలేఖ అందఱకును ఆశ్చర్యము కలుగ జేసినది. సదాశివరాయల పట్టాభిషేకము మరల వైభవముగ జరిగినది.

వెంటనే రామరాయలు బయలుదేరినాడు. నమ్మకమైనట్టియు, బలవంతులైనట్టియు, యోధులను విజయనగర రక్షణకై నియమించి తాను బయలుదేరినాడు. తమ్ముల కలిసికొన్నాడు. వైరిసైనికులకును వీరికిని భయంకరరణము సంభవించినది. ఆహవగాండీవి యయిన వెంకటాద్రి విజృంభించి చండప్రతాపము ప్రదర్శించినాడు. పూలగుత్తుల తఱిగినట్లుగా మహమ్మదీయుల కుత్తుకలుత్తరించినాడు. గజహయములకూల్చివేసినాడు. శత్రుసైన్యములను చిందరవందర జేసి కాందిశీకుల గావించినాడు. ఈతని ధాటికి సంచలించి పోయిన శత్రురాజులు-ఎవరి రాజధానిని వారు కాపాడుకొను నుద్దేశముతో చీలి పోసాగిరి. వ్యూహముల పన్నుటలో ప్రవీణుడైన రామరాయలు తన సైన్యమును మూడు విభాగములు గావించినాడు. తిరుమలరాయని బురహాన్ నిజాంషాను వెంబడించుటకును- వెంకటాద్రిని ఇబ్రహీం ఆదిల్ షా, అమీర్ బరీద్ షాల వెన్నంటునట్లును-నియోగించినాడు. తాను జమ్షీకుతుబ్ షాను వెన్నాడినాడు.

తిమ్మరాజు సహాయార్థము వచ్చునపుడే ఇబ్రహీం ఆదిల్ షా ఆదవానిదుర్గమును జయించి ఆతని సేనాని యైన అసద్ ఖానుకు కొంత సైన్యము నిచ్చి అచ్చట నిలిపెను. ఇప్పుడు అసద్ ఖాను, వెంకటాద్రి తరుముకొని వచ్చుచున్నాడని తెలిసి. యెదుర్కొన శక్తి లేదని యెఱిగి ఆశ్వికసైన్యమును తనతో నుంచుకొని తక్కినసైన్యములను ఆదిల్ షా

సైన్యములో కలిపివేసి వెడలిపోయెను. తరువాత వెంకటాద్రి దుర్గము స్వాధీనము చేసికొని బీజాపురసైన్యములను తరుముచునే పోవుచుండెను. యుద్ధతంత్ర నిపుణుడైన అసదుఖాను వెంకటాద్రికి వెనువెంటనే పోవుచుఒకనాటి రాత్రి అలసిసొలసి సైన్యము నిద్రించుచున్న సమయమున హఠాత్తుగ పైనబడి చీకటిలో గగ్గోలు పుట్టించి సైన్యము చెల్లాచెదరగునట్లు చేసి, స్త్రీలను చెఱబట్టెను. వస్తుసామగ్రిని కొల్లగొట్టి తన సుల్తానును చేరుకొనెను. క్రోధాగ్నిచే దహించి పోవుచున్న వెంకటాద్రి తెల్లవారగనే సైన్యము నంతటిని ప్రోగు చేసికొని తురక సైన్యముల వెన్నంటి కూరకచెర్ల కడ తలపడెను. శత్రుసైన్యముల చిందరవందర గావించి తన కిదివరకు కలిగిన నష్టమునకు పరిహారము గావించుకొనెను. అప్పలరాజు మాత్ర మిట మృతి బొందినాడు. అమీర్ బరీద్ షా పట్టుబడినాడు. తప్పించుకొని పారిపోవుచున్న బీజాపురసుల్తాను వెంటబడినాడు వెంకటాద్రి. రాచూరు ముదిగల్లు దుర్గముల మధ్యనున్న మానువదుర్గము కడ నిలవేసినాడు. పోరుఘోరముగ సాగినది ఇక్కడ జయమునకు కారణభూతుడు ఔకుతిమ్మరాజనవచ్చును. బీజాపురసుల్తాను శరణాగతుడై సంధిచేసికొన్నాడు. రాచూరు, ముదిగల్లు, మానువదుర్గములు సంధి ఫలితముగ విజయనగరమునకు లభించినవి.

ఇట్లుండగా అచట రామరాయలు జమ్షీకుతుబ్ షాను తరుముకొని పోవుచు పానగల్లుదుర్గము కడ సంధించుకొని యోధించెను. అంత నాతడు గోలుకొండకు పాఱిపోయెను.

వాని నంతటితో విడువక గోలుకొండ వఱకు తఱిమి దానిని ముట్టడించెను. ఆతడు రాయబారము సలిపి సంధి కోరగా రాయ లందుల కొప్పుకొనెను. దీని ఫలితముగ నెల్ల యుద్ధములలో కుతుబ్ షా రామరాయలపక్షమై యుండ వలసి వచ్చినది.

ఇక తిరుమలరాయలు బురహాన్ నిజాంషాను తఱుము కొని పోవుచు కళ్యాణనగరము కడ యుద్ధము చేసెను. ఇరు పక్షములును సమబలులై పోరాట మతి తీవ్రముగ సాగించు చుండిరి. కొన్ని దినములు యుద్ధము సాగినది. ఇట్లుండగా జయావహులైన రామరాయలు తూర్పుదిక్కునుండియు, వెంకటాద్రి దక్షిణమునుండియు తమ తమ బలములతో వచ్చి పడిరి. త్రిమూర్తుల కలయికతో పోరాటము తీవ్రమైనది. కల్యాణనగరము వీరికి వదలి నిజాంషా అహమ్మదునగరము నకు పారిపోయెను. కల్యాణనగరసాధకుడైన రామరాయలు నిజాంషా నంతటితో వదలుట మంచిది గాదని అహమ్మద్ నగరమును ముట్టడించెను. ఘోరసంగ్రామము జరిగినది. గొప్ప పరాజయము గలిగి సుల్తాను పారిపోయెను. విజయనగర సైన్యములు అహమ్మద్ నగరు కోటను బ్రద్దలు చేసి సర్వ నాశనము గావించి, నాగళ్ళతో దున్ని ఆముదాలు చల్లించిరి. పాఱిపోయిన నిజాంషా గోదావరి దాటుచుండగా హాండే హానుమప్పనాయడు పట్టుకొని రామరాయల కప్పగించెను. ఇబ్రహీం తోడి మైత్రిని వదలుకొను సంధి షరతుపై నిజాంషా

వదలబడెను. తరువాత గోదావరీజలములతో రక్తసిక్తము లైన కత్తుల గడిగి, పావనస్నాన మాచరించి విజయవంతు లైన సోదరులు విజయనగరప్రవేశము గావించిరి.

## 19

దక్షిణమున కొంత యలజడి బయలుదేరినది. పోర్చు గీసువారు పశ్చిమతీరమున స్థిరపడి ఆ ప్రాంత జనులను క్రైస్తవ మతావలంబుల గావించుచుండిరి. మహమ్మదీయ మతస్థులైన లబ్బీలతో క్రైస్తవమతము నవలంబించుచున్న పరవజాతి తగవు పెట్టుకొనిరి. మధురనాయకుడు లబ్బీలపక్ష మవలంబించెను. పరవవారు క్రైస్తవులైన పోర్చుగీసువారి సాయము కోరిరి. వీరి యండ జూచుకొని తరువాత పరవ వారు మధురనాయకునికి కప్పముగట్ట నిరాకరించిరి. పోర్చు గీసువారి బలమునకు జడిసి మధురనాయకుడు విజయనగర చక్రవర్తికి వార్త నంపెను. అపుడు రామరాయలు పెను గొండ దుర్గాధిపతియైన విఠలరాయుని సేనాధిపతిగ జేసి అత నికి తమ్ముడైన చినతిమ్మరాయని ఉపసేనాధ్యక్షునిగ జేసి పరవవారిని శిక్షింపబంపెను. శౌర్యధైర్యసాహసధుర్యులైన ఈ సోదరద్వయము గొప్పబలముతో మధురాపురము జేరిరి. అప్పటి పాలకుడు విశ్వనాథనాయకుడు. భక్తితో వారికి స్వాగత మొసగి కొంత సైన్యమునుగూడ నిచ్చి తన కుమా రుడైన కృష్ణప్ప నాయకునికూడ తోడుగ నొసంగెను. ఇక్కేరి నాయకుడైన సదాశివనాయకుడు గూడ తోడ్పడెను.

ఆ సముద్రములో తిరువాన్కూరు పాలకుడు ఉన్ని కేరళవర్మ. అతడు విజయనగర శత్రువైన పోర్చుగీసువారికి స్థానమిచ్చుటయే గాక వారి సలహా ననుసరించి విజయనగర సామ్రాజ్యాధిపతుల ధిక్కరించినాడు. అందులకై మొదట వానిని శిక్షించినచో అంతటను బయటికి వత్తురని విఠలుడు తిరువడిరాజ్యముపై దండెత్తెను. కేరళవర్మ మొదట విజయ నగరసైన్యముల నెదిరింప సమకట్టినాడుగాని ఆ సైన్యమందు తన సైన్యము సముద్రములోని కాకిరెట్ట యని తలంచి అప్పటికి పోర్చుగీసు ఫాదరియైన "ఫ్రాన్సిస్ గ్జేవియర్" సాయము కోరినాడు. అతడు "నేను సన్యాసిని. మత ప్రచారకుడను. యోధుడనుగాను. నీకు జయము గలుగుటకై ప్రార్థనలు చేయగలను. అంతియేకాని ఇంతకంటె మించి నాచేత కాదు" అని అన్నాడు. అటులనే కానిమ్మన్నాడు కేరళవర్మ. ఇంతలో విజయనగరసైన్యములు పురమును సమీపించుచుండెను. అపుడా ఫాదిరి నల్లనిగౌను వేసికొని విజయనగర సైన్యము ముందు నిలబడినాడు. సైన్యములాగినవి. క్రైస్తవ మతప్రచారకుడు, ప్రచారధోరణిలో కొన్ని శాంతిపలుకులు పలికినాడు. హిందూదేశ దేవాలయముల, కొల్లగొట్టించు క్రైస్తవమత ప్రచారకుడు సామరస్యమును గురించి బోధించినాడు. హింసా దౌర్జన్యములే ప్రాతిపదికగా తమ మతవిస్తరణ గావించు క్రైస్తవమత ప్రచారకుడు అహింసను గూర్చి ప్రబోధము గావించినాడు కొంతసేపు విన్నాడు విఠలుడు.

"మఱి ఇంక నేమి చెప్పదలచుకొన్నారు?" అని యడిగి నాడు.

"నీసేనలను వెనుకకు మరలింపుము" అన్నాడు ప్రచారకుడు.

"జయింపనిదే మరలవు."

"అయినచో నేను వదలను"

విఠలుడు కోపగింపలేదు. ఔదాసీన్యముతో,

"తొలగుట శ్రేయస్కరము." అన్నాడు.

"ఇది యేసుక్రీస్తువాక్యము. మీరు జవదాటుటకు వీలు లేదు."

"ఇవి విజయనగర సేనలు. ఎఱ్ఱగుడ్డను చూచి బెదురునవి కావు. వెంటనే దారి తొలగెదవా లేక త్రొక్కుకొని పొమ్మందువా?" అనుచు "నడువుడు" అని సేనల కాజ్ఞాపించినాడు విఠలుడు. ఆ ధైర్యశాలి పరుగు పరుగున ప్రక్కకు పాఱిపోయినాడు. విజయనగర సైన్యములు తిరువడిరాజ్యము నెల్లను జయించి మలయాద్రికడ నొకటియు, కన్యాకుమారి కడ నొకటియు జయ స్తంభముల నాటించిరి. తరువాత పరవల శిక్షించి కప్పమును లాగిరి.

పోర్చుగీసువారి దుండగములకు మేర లేదు. తిరువడి రాజ్యములో ననేక దేవాలయములు కొల్లగొట్టిరి. అదేగాక అప్పటి పాలకుడైన "మార్టింఅల్ఫాన్సో డిసౌజా" అను నాతడు తిరుపతి దేవస్థానములో దేవునిక్రింద స్థాపితమైయున్న

బంగారమును కొల్లగొట్టుటకై ఒక బలమైన సిబ్బందిని తయారుచేసినాడు. అది రామరాయలకు తెలిసి తగురక్షణను తిరుపతిలో నేర్పాటు చేసి విఠలున కీవార్త తెలుపగా నతడు సైన్యములను పడమటి కోస్తావెంట నడిపించి గోవా కొల్లగొట్టి ఆ పాలకుని బంధించి సదాశివరాయల సమక్షము నందుంచినాడు. పోర్చుగీసువారు సంధి చేసికొనవలసివచ్చినది. రామరాయలన్నచో వారికి మరింత విరోధభావము పెరిగినది.

# 20

మహమ్మదీయసుల్తానులలో ఒకరికొకరికిపడదు. అట్లు పడకుండ నెంతకాలముండునో యంతకాలమును తనకు జయమను రాజనీతి రామరాయలకు గలదు. అందుకే వారిలో నెట్టికలహము సంభవించినను ఒకరి పక్షము చేరి రెండవ పక్షము వారిని బలహీనపఱుప యత్నించుచు నుండు వాడు. అహమ్మదునగరసుల్తాను,బీజాపురసుల్తాను గైకొన్న అయిదు మండలములను తిరిగి పుచ్చుకొనవలెనన్న యభిప్రాయముతో దండెత్తతలంచెను. అందులకై రామరాయల సహాయమును గోల్కొండసుల్తాను ద్వారా కోరెను. రామరాయ లందు కొప్పుకొనెను. అతనికిని అహమ్మదునగరు గోల్కొండసుల్తానులకును సంధిపత్రములపై సంతకములు జరిగినవి. వెంటనే మిత్రసైన్యములు బీజాపురమును చుట్టుముట్టినవి.

వెంకటాద్రి రాచూరుకోటను ముట్టడించి బీజాపుర సుల్తానునోడించి భీమనదీ ప్రాంతములో మరల నోడించినాడు. భయపడినవాడైన సుల్తాను తన సేనానియైన అసాదుఖానుతో ఆలోచింపగా దూరాలోచనపరుడును, అనుభవజ్ఞుడును నగు నాతడు నిజాంషా భూములను అతనికే యిచ్చివేయుమనియు, రామరాయలతో ధనమిచ్చి సంధి చేసికొనుమనియు చెప్పి దీని కంతయు కారణభూతుడైన గోల్కొండసుల్తానును నేను తప్పక ఓడించెదనని తెలిపి, యెవరిపాటికివారు వెళ్ళిపోయిన యనంతరము గోల్కొండపై పడి వానినోడించి విడిచిపెట్టెను.

నిజాంషా బలవంతుడాయెను. కొంత గర్వించి మత్స రించెను. రామరాయ లాతనిని శిక్షించిన బాగుండునని తలంచెను. బీజాపురపాలకుని పురికొల్పి దండయాత్ర చేయించెను. బాధితుడైన ఆదిల్‌షా క్రోధముతో వానిపై బడి చప్పగ నోడించి విడిచిపెట్టెను.

ఈ జయమువలన బలవంతుడై ఆదిల్‌షా కొంత గర్వించినాడు. ఇంతలో అతని వృద్ధసేనాని అసాద్‌ఖాను మరణించినాడు. దీనికి అహమ్మద్‌నగరునిజాంషా సంతోషించి ఈ తరుణమున బీజాపురఆదిల్‌షాను మరింత బలహీనుని జేయు నుద్దేశ్యముతో రామరాయలతో సంధి గావించుకొనెను. అందులకు ఆదిల్‌షా మండిపడి తన ఆస్థానమునందున్న విజయనగరరాయబారుల నవమాన పఱచినాడు. రామరాయలు లోకత్రొక్కిన త్రాచువలె మండిపడి ఇక్కేరి

నాయకుడైన సదాశివనాయకుని అధ్యక్షతను గొప్ప సేనను బంపించెను. అతడు కలుబరిగెను ముట్టడించెను. బహుసైన్యములతో బీజాపురసుల్తాను ఎదిరించి ఘోరపరాజయము నొందెను. జయావహుడైన సదాశివనాయకుడు ప్రస్తుతము బీజాపురసుల్తాను అధీనమందున్న కళ్యాణిని ముట్టడింపబోవుచుండ దారిలో మరికొంత సైన్యములతో రామరాయలు కలిసికొనెను. బీజాపురసుల్తాను స్వస్థానమునకు వెళ్ళి, ఉన్న అన్ని బలములను కూర్చుకొని వచ్చి, ముట్టడించిన శత్రువుల నెదుర్కొనెను. భయంకరయుద్ధము సంభవించినది. పోరు కొన్ని వారాలు సాగినది. కడకు ఆదిల్‌షా విజయనగరసైన్యముల ధాటి తాగలేక పాఱిపోవలసి వచ్చెను. మందుగుండు సామగ్రినిగూడ వదలి సుల్తాను సైన్యములు భ్రాంతములై పారిపోయినవి. సుల్తాను మరి తలయెత్తలేని యోటమినిపొందినాడు. యుద్ధనైపుణ్యమును ప్రదర్శించి జయము గొన్న సదాశివనాయకునకు రామరాయలు "కోటికోలాహల" యను బిరుద మిచ్చి గౌరవించినాడు. అక్కడ అసద్‌ఖానుచే నోడిపోయిన జమ్షీదుకుతుబ్‌షాకు మతి చలించినది. అల్పదోషములకు గూడ ప్రజల చంప మొదలిడినాడు. రాజ్యాధికారము కొఱకు ప్రయత్నించిన తన సోదరుడు ఇబ్రహీంను రాజ్యము వెడల గొట్టినాడు. వాడు విజయనగరమునకు పారిపోయి రామరాయల శరణు జొచ్చినాడు. ఈ పాదాక్రాంతతకు సంతోషించి రామరాయలు వానిని మర్యాదచేసి పోషణకై

కొంత జమీా నిచ్చినాడు. ఇటుల కొంత కాలము జరిగినది. గోల్కొండలో జమ్షీాకుతుబ్ షా మరణించినాడు. అతనికొడు కైన సుభాన్ కూలీని రాజును చేసి సెయిఫ్ ఖానును సంరక్షణ కర్తగా నుంచవలెనని వాని తల్లి కోరిక. ప్రధానమంత్రి ము స్తఫాఖానున కది యిష్టము లేదు. అతడు, వెంటనే రావలసినదని ఇబ్రహీమునకు చెప్పి పంపెను. ఇబ్రహీం, రాయలసహాయము నడిగినాడు. అతడు పదివేల యాశ్విక దళముతోడను, ముప్పదివేల పదాతుల తోడను వెంకటా ద్రిని ఇబ్రహీమునకు తోడుగ పంపినాడు. ఆంధ్రసైన్యప్రతిభ నెరిగిన వారు గాన గోల్కొండవా రెట్టి ప్రతిఘటనను కన బఱుప లేదు. ఇబ్రహీంసుల్తానయినాడు. రామరాయ లీవిధ ముగ నిబ్రహీమునకు రాజ్యప్రదాత యయినాడు.

## 21

శ్రీకృష్ణదేవరాయసిర్మిత భువనవిజయము నేకసత్కా ములాడు నట్టిది రత్నకూటము. విజయదశమినాడు, కవు లును, పండితులును, గాయకులును, చదరంగఖేలనాధురీణు లును హాజరైనారు. కవిత్వవిమర్శ ఆనాడు చర్చనీయాంశము. రామరాయలు సభనుద్దేశించి,

"కవిత్వమునకు మూలమైన దేది?" అని ప్రశ్నించినాడు. ఎవరును జవా బీయ లేదు.

"రామయామాత్యా! నీ అభిప్రాయమెద్ది?" అన్నాడు రామరాయలు.

"భావనాశక్తి"

"రాజనాథడిండిమా! నీ యభిప్రాయము?"

"శ్రేష్ఠమైన ప్రసిద్ధమైన వస్తువు!"

రామరాయల జవాబులు తృప్తి నీయలేదనిగ్రహించిన తిరుమలాంబ "ప్రపంచనాశక్తియు లోకజ్ఞానమును" అని యన్నది.

అందుగుల వెంకయామాత్యుడు "భగవత్కటాక్ష"మన్నాడు. రంగపరాజు "పాండిత్య"మన్నాడు.

మఱికొందఱు మఱికొన్నిరీతుల చెప్పినారు.

రామరాయల కవి తృప్తి నీయలేదు. భట్టుమూర్తి నుద్దేశించి "భట్టుమూర్తీ నీ అభిప్రాయమెద్ది?" అన్నాడు. భట్టుమూర్తి లేచి "మహాప్రభూ! కవిత్వమునకు మూలము ప్రతిభ! మిగిలినవన్నియు దానికి పోషకములు. ప్రతిభ లేని వాడు కవికాలేడు. కవియే గాడు. ఏ కళాకారుడునుగాలేడు. గ్రంథముల జదివినచో పాండిత్య మలవడగలదు. ఉత్తమ జ్ఞానమును పొందగలము. కవితావస్తువును గూడ సంగ్రహింప వచ్చును. అంతేగాని ప్రతిభను సంపాదింపలేము. అది పుట్టుకతోనే రావలసి యున్నది." అన్నాడు. భట్టుమూర్తి జవాబురాయలకు తృప్తినిచ్చినది. మిగతవారిలో కొంతమంది

కది నచ్చినది. కొంతమందికి నచ్చలేదు. దాని సత్యాసత్యముల విడనాడి వాదనకు దిగినారు. వాదము వాదముకొఱకే యన్నట్లుగ సాగించినారు.

పాండిత్యవిషయమున రాజనాథడిండిముడును, సంగీతవిషయమున రామయామాత్యతోడరమల్లును భట్టుమూర్తిని యొప్పుకొనరు. పండితులు మఱికొందఱు మఱికొన్ని విషయములలో నొప్పుకొనరు. అందులకే సంను దొఱికినచో భట్టుమూర్తితో వాదముల బెట్టుకొను చుందురు. పండితులలో నిట్టి మాత్సర్యము సామాన్యమే! అదియు గాక భట్టుమూర్తి భట్టురాజకులుడు. అబ్రాహ్మణకవు లంతకుముందెందఱో మహాకావ్యముల వ్రాసియున్నను-వానిని చూచుచునే-అబ్రాహ్మణులు కవిత్వము వ్రాయుటా-అన్న ఔదాసీన్యమును, ఓర్వలేనితనమునునాటిబ్రాహ్మణపండితులలోను కవులలోను గలదు.

భట్టుమూర్తి నిజము… …త్సరి… …గ… వాడే! రామరాయలకు ప్రీతిపాత్రులైన కవులలో భట్టుమూర్తి యగ్రేసరుడు. ఇతనికున్న సంగీత, సాహిత్యజ్ఞానము మరెవ్వరికిని లేదు. సంగీత సాహిత్యముల మేళవించి పాడుటలో-రచించుటలో-అతని కతడే సాటి! జడముల సైతము సప్రాణులుగ భాసింపజేయగల నేర్పరి. వేదవేదాంగపారంగతుడు. తర్క-మీమాంసాది సకలశాస్త్రపారంగతుడు. వీణా గానకళాధురీణుడు. వీణానిర్మాణమునకు గూడ నాది పురుషుడు.

సంస్కృతాంధ్ర సాహిత్యసర్వస్వమును కరతలామలకము గావించుకొన్నాడు. సామవేదము సంపూర్ణముగ నభ్యసించినవాడు.

సారములేనిచర్చ-కేవలము మాత్సర్యము ప్రాతిపదికగా నడుచుచున్న చర్చ-రాయలు విన నుత్సాహముచూపలేదు. అందు చేరిన కవులు తమతమ కావ్యముల నుండికొన్ని ఘట్టముల చదివి వినిపించుచున్నారు. తన స్వరమేళ కళానిధి నుండి కొంత గానము చేసినాడు రామయామాత్య తోడరమల్లు. తన రామరాజీయము లోని కొన్ని ఘట్టముల వినిపించినాడు అందుగుల వెంకయ. రామరాయలు మహామ్మదీయులతో చేసిన యుద్ధములలో వైరులను గొట్టెలవలెను, రామరాయలను తోడేలుగను వర్ణించిన ఘట్టములు ప్రేక్షకుల నుద్రిక్తుల జేసినవి. వెంటనే పొట్టలు చెక్కలగునట్లు నవ్వించినవి. భట్టుమూర్తి తానపుడు రచియించుచున్న వసుచరిత్ర నుండి కొన్ని ఘట్టముల చదివి తనయతిలోక సామాన్య భావనా పటిమను ప్రదర్శించినాడు తన పద్యముల కన్నిటికిని వీణా మృదంగ తాళములతో లయను పొందించినాడు.

ఇంతలో మంగలి తిమ్మోజుకొండోజు సభలోనికివచ్చినాడు. రామరాయ లతనిని జూడగనే యాహ్వానించి యుచితాసనముపై కూర్చుంటబెట్టి సభ నుద్దేశించి-"చతుష్షష్టి కళలలో క్షౌరకళకూడ నొకటి. ఆ కళ యుత్కృష్టతను నేడు తెలిసికొన గలిగితిని ఈ యుదయమున క్షౌరమునకు రమ్మని

సిన్న నేను తిమ్మోజుకొండోజు నాజ్ఞాపించి యుంటిని. ఉదయ ము న నిర్ణీత కాలమునకు లేవలేక పోతిని. కొండోజీ వచ్చి, చూచి, నిద్రాభంగము కాకుండగనే క్షౌరము చేసి పోయి నాడు. తరువాత నేను నిద్రలేచి అద్దమున చూచుకొని రహ స్యము తెలిసికొని ఆనందించి యతని నీకొలువునకు రమ్మం టిని. ఈతనికి మల్లాపురమును అగ్రహారముగ నిచ్చుచున్నా ను''అనెను. రాయలవారి కళాభిజ్ఞతకు కొందఱు సంతసిం చిరి. మఱికొందఱు మత్సరించిరి. అందులో మురారిశాస్త్రి లేచి "అధమకులజులకు గూడ నగ్రహారమా'' యని బాధను వ్యక్త పఱచినాడు.

"మరెవరికుండవలయును ?'' అని రామరాయలు ప్రశ్నించి నాడు.

"అది అగ్రజన్ములగు బ్రాహ్మణులకే.''

"శాస్త్రీ! సంఘమునకు నిజముగ సేవచేసినవారికిని, మేధా వులకును, పండితులకును, పూర్వము అగ్రహారము లొసగెడి వారు. ఇపుడట్టి వేమియు లేకుండగనే కేవలము బ్రాహ్మణు లకు రాజులిచ్చుచున్నారు. ఎందుకనగా అటులనే చేయవల యునని శాస్త్రములలో నున్నదని మీబోటివారు చెప్పు చుండుటచేగాబట్టి, అది యీనాడెన్నియో నష్టములదెచ్చి పెట్టి నది. మతవిషయమునను, సంఘవిషయమునను ఎట్టి నష్టములు వాటిల్లినవో మీకే బాగుగ తెలియును. మనమిక అట్టివానినే

పట్టుకొని ప్రాకులాడరాదు. సంఘములో సమత్వమును ఐక మత్యమును మనము ప్రోత్సహించి ప్రచారము గావింపవలెను. కళాకారు లీపనిని తమ విధిగ భావింపవలయును.'' '

## 22

ఇబ్రహీంఆదిల్‌షాతో కొంత సఖ్యముతో నుండిన హుసేన్ నిజాంషా ఇబ్రహీంకుతుబ్షావలన ప్రేరితుడై కలు బరిగెను ముట్టడించెను. ఆదిల్‌షా భయపడి రామరాయల సహాయముకోరగా యుద్ధనీతిపారంగతుడు రామరాయలొప్పు కొని తన తమ్ముడైన వేంకటాద్రిని పానగల్లును ముట్టడింపు మనెను. అట్లు జరుగగా కుతుబ్‌షా సంధిభంగము గూడ గావించి నిజాంషానువదలి వెనుకకు పోయినాడు. నిజాంషా రాయలతో సంధిచేసికోవలసి వచ్చినది. కుతుబ్‌షా ఇకమీ దట రామరాయలకే సహాయము చేయుదునని సంధిపత్రము గావించినాడు.

ఇబ్రహీంఆదిల్‌షా మరణము చెందెను. ఆలీఆదిల్‌షా రాజ్యమునకు వచ్చెను. బాలుడగుటచే నిజాంషా అతనిపై దండెత్తెను. అతడు విజయనగరమునకు పారిపోయి రామరా యుల శరణు జొచ్చెను. అపుడే పుత్రమరణముచే శోకించు చున్న రామరాయదంపతు లతనిని పుత్రునిగ స్వీకరించిరి. తరువాత రామరాయలు అతనికి సహాయముగ సైన్యముల

బంపి నిజాంషా రాజ్యమును ధ్వంసము గావించెను. నిజాంషా పారిపోయి సరాసరి గోల్కొండ కేగెను. గోల్కొండకుతుబ్ షా తెలివైనవాడు. మహమ్మదీయసుల్తానులు పరస్పరము పోట్లాడుచుండు నంత కాలము హిందూరాజ్యము విస్తరించి ధనవంతమై పోవుటయేగాక సుల్తానులవమానముల పొందుట నతడు సహింపలేదు. సుల్తానులు వివాహబంధములు కల్పించుకొని ఏకముకావలె నన్నాడు. నిజాంషా కుతుబ్ షాతో బాంధవ్యము నెఱపుకొనుట కొప్పుకొన్నాడు గాని ఆదిల్ షాతో చేయుటకు ససేమిరా యన్నాడు. ఇరువురును కలిసి కల్యాణిదుర్గమును ముట్టడించినారు. అలీఆదిల్ షా రామరాయల సహాయము కోరినాడు. రామరాయలువచ్చి సంధిషరతు ప్రకారము గోల్కొండ ఇబ్రహీమును తనతో చేరుమన్నాడు. అతని కట్లు చేయక తప్పినదిగాదు. ఈ పక్షమున నుండి కూడ నిజాంషాకు సహాయము చేయుచుండెను. ఈతని శల్యసారథ్యమువలన నిజాంషా చాల కాలమువఱకు లొంగలేదు. రామరాయలు దీక్షతో పోరాడుచునే యున్నాడు. కడపటికి కొండపల్లి సర్కారును, ఆదుర్గమును రామరాయల కొసగు సంధిషరతుపై రామరాయలు యుద్ధమును మానివైచెను.

కుతుబ్ షా చేసిన ఈ సాహాయ్యమునకు నిజాంషా ఆనందభరితహృదయుడై తనకుమార్తె బీబీజామల్లీని కుతుబ్

షా కిచ్చి వివాహము గావించెను. మహమ్మదీయ సుల్తా నుల కలయిక కిది పునాది.

## 23

చరిత్రకారుడైన మహమ్మద్ ఫెరిస్తా కొలువుదీరి యున్న హుసేన్ నిజాంషా కడకు ఒక పోర్చుగీసు చరిత్ర కారుని పిలుచుకొని వచ్చినాడు. అతని పేరు ఫ్రెడరిక్. అతడు దక్షిణహిందూదేశ మంతటినిపర్యటించి అందరి పాలకులయు, ప్రజలయు సాంఘికార్థికాది విషయపరిశీలనచేయు కోరికతో వచ్చినాడు. మొదట అతనికి ఆహ్వానమిచ్చినవాడు, ఫెరిస్తా.

ఫెరిస్తా అప్పటికే దక్కనుసుల్తానుల చరిత్రయు, విజ యనగరరాజుల చరిత్రయు వ్రాయుచున్నాడు. తన వ్రాత లన్నిటిని "ఫ్రెడరిక్" నకు చూపినాడు. తర్వాత హుసేన్ నిజాంషా కడకు పిలుచుకొనిపోయి పరిచయము చేసినాడు. సుల్తాను ఆదరించి కూర్చుండ నియమించి,

"మీ రెంతకాల మెక్కడెక్కడ సంచారము గావించి నారు?" అనెను.

"మూడు సంవత్సరముల నుండి విజయనగరరాజ్యమును సంచరించితిని."

"గోవావిరోధులైన విజయనగరరాజుల గురించి మీరేమి వ్రాసితిరి?"

"చూచిన యదార్థములను."

"మా ఫెరిస్తా వ్రాతల మీరు చూచితిరా?"

"చూచితిని, అది చరిత్రగాదు."

"ఏలకాదు?"

"మీ చరిత్రకారుడు సత్యమును తలక్రిందు చేసినాడు. ఇటీవల జరిగిన కొన్ని యుద్ధములను, రామరాయల పాలనా పటిమను కన్నార చూచియున్నాను. వానిని సైతము మీ చరిత్రకారుడు తలక్రిందులు చేసినాడు."

"మీ రిట్లు వ్రాయరా?"

"నాచేతగాదు."

"విజయనగరరాజులు గోవాకు ప్రత్యక్షశత్రువు లన్నది మరచితిరా?"

"ఉండవచ్చును. దానికిని యదార్థచరిత్ర వ్రాయుటకును సంబంధమేమున్నది? చరిత్రకారుడు సత్యమునే వచింపవలసి యున్నది. కానిచో వాడు ప్రపంచమునే మోసము చేయు చున్నాడన్నమాట."

"చరిత్రకారుడు వ్రాసినదే సత్యమగును. కాబట్టి నీవు మా ఫెరిస్తాను తప్పక అనుసరింపవలసి యున్నది."

"నే నట్లు వ్రాయను. ఒకవేళ నే నట్లు చేయుచో నక్కడ సత్యము వ్రాయువా రుండరా?"

"అక్కడెవరును చరిత్రకారులు లేరు."

"కావచ్చును. కవిశ్రేష్ఠు లనేకు లున్నారు."

"కవులు భావుకులు. అతిశయోక్తులు పలుకుచుందురు. వారి మాటలను భావి చరిత్రకారులు విశ్వసింపరు."

"అట్లనుకొనుట పొరపాటు. కవులుగూడ చరిత్రకారులే! జాతిచరిత్ర సారస్వతమున ప్రతిబింబించుచుండును. ఒక విషయమును అతిశయోక్తిగ చెప్పినంత మాత్రాన అసలావస్తువే లేదందుమా?"

సుల్తానుకు కోపము వచ్చినది. విసిగిపోయినాడుగూడ. అతని నేమనుటకును వీలులేదు. ఇతని నిట్లే వదలినచో తమ విరోధుల గుఱించి ఉన్న దున్నట్లుగ వర్ణించు నేమో! కడపటికి స్నేహముగ నతనిని పలుకరించి "మనవిరోధుల చరిత్ర మాఫెరిస్తా వ్రాసిన దానివలె నుండునట్లు చూడుడు" అని సెలవొసంగినాడు. ఫ్రెడరిక్ గోవా వెళ్ళగానే తత్పాలకుల నుండి యతనికి మందలింపు వచ్చినది. తరువాత ఫ్రెడరిక్కు అసత్యమును వ్రాయలేదేమో గాని విజయనగర రాజుల గుఱించి మాత్రము ముఖ్యాంశముల వ్రాయలేదు.

## 24

రామరాయ లిప్పటికి ఎబ్బదియేండ్ల వృద్ధుడు. కాని వృద్ధత్వ మతనిలో కనిపించదు. దృఢమైన శరీరము! గంభీర

మైన ఆకృతి! ప్రసన్నమైన దృక్కులు! చైతన్యపూరితమగు మేధస్సు!

వ్యూహములు పన్నుటలో దిట్ట! మిత్రభేదముగల్గించి శత్రుబలముల క్రుంగదీయుటలో నేర్పరి. ఈ నేర్పరితనమే యిరువదియైదేండ్లు బహామనీ సుల్తానుల నేకముకాకుండ జేసినది! ఈనేర్పరితనమే విజయనగరాంధ్రసామ్రాజ్యము చెక్కు చెదరకుండ నిలుచుటకు కారణమైనది. ఈ నేర్పరితనమే బహామనీసుల్తానుల కండ్లు తెరిపించి ఏకమై విజయనగరముపై దెబ్బ తీయుటకు గూడ కారణమైనది.

పరస్పరకలహ సమయములలో బహామనీసుల్తానులు రామరాయల శరణు జొచ్చువారు. అతని సాయమునుపొందు చూనే కృతఘ్నులుగ ప్రవర్తించెడివారు. గోల్కొండ ఇబ్రహీం కుతుబ్ షా కితడే రాజ్యప్రదాత! బీజాపురపాలకుడు ఆలీఆదిల్ షా కితడే రాజ్యప్రదాత! అదియేగాదు. ఆలీఆదిల్ షా రామరాయ దంపతులతో "నేను మీబిడ్డను" అని చెప్పుకొని పుత్రవాత్సల్యమును పొందియున్నాడు. ఎంతో సహాయమును పొందియున్నాడు. అయిననేమి? తమ మతమునకు విజయనగరాంధ్ర చక్రవర్తులుబద్ధవిరోధులు. హుసేన్ నిజాంషా రామరాయ లన్నచో పండ్లు పటపట కొరుకువాడు. వీలగుచో పట్టి కరకర నమలవలె ననుకొనుచుండువాడు. ఈ మత్సరమే ప్రబలవిరోధియగు ఆలీఆదిల్ షాతో సైతము వివాహబంధము కావించుకొనుటకు పురికొల్పినది.

ఇదివఱకే హుసేన్ నిజాంషా తనకుమార్తె బీబీజామ ల్లీని ఇబ్రహీంకుతుబ్ షాకిచ్చి వివాహము గావించియున్నాడు. మరియొక కుమార్తెయైన చాంద్ బీబీని ఆలీఆదిల్ షా కిచ్చినాడు. ఆదిల్ షా చెల్లెలైన ఫలాబీబీహాద్యసుల్తానాను నిజాంషా పెద్దకొడుకైన మహాజడామూర్తజాకు చేసినాడు. వీరు ముగ్గురు నీవిధముగ నేకమగుట చూచి మతసూత్రబద్ధులై బీదర్ బీరార్ సుల్తానులుగూడ వారిలో గలిసినారు. కడపటి ప్రయత్నముగా విజయనగరమును ధ్వంసముచేయవలయునని ప్రతిజ్ఞ తీసికొన్నారు.

ఈ విషయము తృటిలో రామరాయలకు తెలిసినది. చంద్రలేఖతో నెప్పటివలెనే యాలోచించినాడు. వారెల్లరు మతసూత్ర బద్ధులగుటచేత తమ వైపున నున్న మహామ్మదీయ సేనాపతులను నమ్మి వారిచేతికి సేనల నీవలదని చంద్రలేఖ సలహా యిచ్చినది. రాయలామె సలహా నీపర్యాయము పాటింపలేదు. మహామ్మదీయ సేనాధిపతులు తన నింతవఱకు మోసము చేసినట్లు తాను భావింప లేదు.

మొదట నాందిగ బీజాపురసుల్తాను రామరాయల కడకు రాయబారుల పంపి తా నిదివఱ కపుడపుడు బీజాపురమునుండి గైకొన్న యాతగిరి, బగ్రకోట, రాచూరు, ముదిగల్లు, దుర్గముల విడిచిపెట్ట వలసినదిగ నడిగించినాడు. ఉద్దేశము బట్టబయలుకాగా రామరాయలు కోపదర్పములతో "జాగ్రతగ మసలుకొను మనుము" అని జవాబిచ్చి

పంపినాడు. అట్టి జవాబు కొఱకయిదే వచ్చిన రాయబారులు వెళ్ళిపోయినారు.

సమురోత్సాహ సంభరితులైన దక్కనుసుల్తాను లందఱును బీజాపురప్రాంతపు బయళ్ళలో కలిసికొన్నారు. ఆనంద కోలాహలములతో దక్షిణమునకు పయనించినారు.

విజయనగర సేనావార మొక పారావారము. రామరాయలు దానిని మూడు భాగములుగ జేసి యొక వర్గమును తిరుమలరాయని యధ్యక్షత క్రిందను, మఱొక వర్గమును వెంకటాద్రి యధ్యక్షత క్రిందను మూడవ వర్గమును తన యధ్యక్షత క్రిందను నుంచెను. మొదట వేయిగజములతోడను ఇరువదివేల యాశ్వికదళము తోడను, లక్షమంది కాల్బలము తోడను తిరుమలరాయలు కృష్ణాతీరమున వైరిసైన్యమును తాకెను. ఉభయ సైన్యములును తీవ్రముగ ఢీకొన్నవి. ఇట్లుండగ వెంకటాద్రి, వెనుక నైదుమైళ్ళలో దారితొలగి, పైపాటుగావచ్చి దూర్పుదిక్కునుండి శత్రుసైన్యముపై పడెను. తురకసైన్యములు తికమక జెందినవి. ఆ మఱునాటికే ఎనలేని సైన్యముతో రామరాయలుపడమటివైపునుండి వచ్చిపడెను. శత్రుసైన్యములు అడకత్తెరలోని పోకలైనవి. ఎటుచూచి నను విజయనగర సేనలే కనుపింపగా తురకసైన్యములు సంచలించిపోయినవి. ఆంధ్రసైన్యములు మునము బెట్టి నఱుకుకొనివచ్చుచుండ చూచి భయభ్రాంతి జెందినవి. చెల్లాచెదరై పాఱజొచ్చినవి. సుల్తానులు కంపించిపోయినారు. దిక్కుతోచనివారై రాయలతో సంధికి ప్రయత్నించినారు. కానియతడుసనసే

మిరా యన్నాడు. సుల్తానుల నందఱను కలిపి యొక్కమారోడించి తఱుమ వలెనని దృఢ సంకల్పుడైనాడు. మఱునాడారితేరిన రాచవారి నందఱను ముంగలి మునముగా నేర్పఱచి శత్రువు లొక్క పురుగైనను చొచ్చుకొని రాకుండ చూడుడని యాజ్ఞాపించినాడు. దక్కను సుల్తానులుగూడ ఖురాసాని ఆశ్వికదళమును ముందు నిలిపినారు. భయంకర మారణహోమము జరిగినది. తురకసైన్యము చాల దెబ్బ తిన్నది. ఎదుర్కొనలేక వెనుదీసినది.

తర్వాత రామరాయలు మరొక వ్యూహమును పన్నినాడు. మొదటి మునము ఆశ్వికదళము, ఆవెనుక వరుసలో నక్కడక్కడ మరఫిరంగులు. ఆ వెనుక నొడలికంతయు నూనెపూసికొని లంగూటములు మాత్రము కట్టికొని నిలిచియున్న పదాతులు! ఈవిధముగ మూడు విభాగములు. ఇది చూచిన మహమ్మదీయ సుల్తానులు గూడ తమ సైన్యముల మూడుగ విభజించినారు. కుడిభాగమున వెంకటాద్రి సైన్యముతో ఆలీఆదిల్ షాయును- ఎడమభాగమున కుతుబ్ షా, బరీద్ షాలు తిరుమలరాయ సైన్యములతోడను- మధ్యభాగమున హుసేన్ నిజాంషా రామరాయుల సైన్యముతోడను- తలపడినారు. రామరాయలపై పగబట్టి చంప పట్టుదల వహించియున్న నిజాంషా ఆరితేరిన ఖురాసానీ విలుకాం డ్రధిష్ఠించిన యాశ్వికదళమును, ఆరువందల మరఫిరంగులను ముందిడుకొని రామరాయలతో పోరాడుచున్నాడు. తిరు

మలరాయ వెంకటాద్రులు రామరాయలసమీపించి "మీరు వృద్ధులరు. శత్రువులకు బుద్ధి చెప్ప మేము చాలుదుము. మీరు విశ్రమించి వెనుక నుండుడు." అని ప్రార్థించినారు. రామరాయలు దర్పించి, ధీరుడై యువకయోధుని వలె ముందుకు దుమికి "మీ రేగి మీ మీ మనముల కాపాడుడు. అని హెచ్చరించి సింహనాదము గావించుచు సేనామధ్యమున యుధిష్ఠిరుని వలె నిలబడి "మీలో నెవ్వరేని యుద్ధమున కిష్టపడని వారున్న చో వెంటనే తొలగి పోవచ్చును. భయపడిన వారు తమ ప్రాణముల రక్షించుకొనుటకు స్వేచ్ఛ నిచ్చుచున్నాను." అన్నాడు. అంతట సేనావార మంతయు నుద్రిక్తమై చచ్చువఱకు యుద్ధము చేయుదు మని ప్రతిజ్ఞ చేసి, సింహనాదముల గావించి వైరులపై విరుచుక పడినారు.

మరల భయంకరపోరాటము చెల రేగినది. మహాభారతయుద్ధమును తలపించు మహాసంగ్రామము మరల నేడు జరిగినది. పాండవ కౌరవ సైన్యములలో గల అతిరథశ్రేష్ఠులు ఈ యుభయసైన్యములలో నున్నారు. విజృంభించి వీరవిహారము చేయుచున్నారు. తురకసైన్యములలో కొంత భాగము తుత్తుమురై పోయినది. విజయనగరసైన్యములో కొందఱు వీరమరణమునొందిరి. తిరుమలరాయ పుత్రు లిద్దరును మరికొంత మంది దండనాథులును చంపబడిరి; ఈదృశ్యము రామరాయల మరింత రెచ్చగొట్టినది. కోపముచే మండి పోయినాడు. మహోగ్రుడై పండ్లు పటపట కొఱికి-

ఉత్తుంగభద్రాశ్వము నెక్కి "గరుడా! గరుడా!" యని కేకలు వేయుచు–సింహానాదముల చేయుచు–తన సైన్యముల పురికొల్పుచు–శత్రుసైన్యములపై పడి సంహారము గావిం పుచు విలయతాండవము చేయుట చూచి ఎదుట నున్న సుల్తానుల సైన్యములు తాళలేక చెల్లాచెదరై పాఱిపోయి నవి. బీదర్ బీజాపూర్ గోల్కొండ సైన్యములు చెదరిపోగా హుసేన్ నిజాంషా రోషముతో తలపడుట చూచి మహో గ్రుడై రామరాయలు శత్రుసైన్యములపై మరల పడి అరటి బోదెల నఱకున ట్లవలీలగ నఱికి పారవేసెను. నిజాంషా యొక్క రెండువేల యాశ్వికులు మరణము నొందగా వెను దిరిగి యుద్ధమునుండి తొలగెను. ఇదివఱకే పాఱిపోయిన బీజా పురసుల్తాను అవమానాగ్ని దహింపగా రోషితుడై మరల నాశ్వికుల కూర్చుకొని రామరాయలపై పడినాడు. మరల భీషణరణము ఘటిల్లినది. రాచవీరులు తురకవీరుల తుండ్లు తుండ్లుగ నఱికినారు. ఏనుగులు గుఱ్ఱములు ముక్కలుముక్క లుగ చెండాడినారు. సుల్తాను మరల పారిపో నుంకించుచుండగా నిజాంషా మరల వచ్చిపడినాడు. మంచి వ్యూహామును పన్ని కొని వచ్చినాడు. తన సైన్యములవెనుక చాల ఫిరంగులను వరుసగ నుంచినాడు. తాకినట్లే తాకి తురకసైన్యములు వెనుదీసినవి. విజయనగరసైన్యము తరుముచు ముందుకు జరిగినది. తురకసైన్యము ఫిరంగుల వెనుకకు జరిగినది. హిందూసైన్యము సరిగా ఫిరంగుల ముందుకు నడచినది. ఢాం ఢాం అని ఒక్కసారిగ ఫిరంగులు ప్రేలినవి. శలభ

ములవలె హిందూసైన్యము మాడిపోయినది. ఆ క్షణాన ఆహుతియైన హిందూసైనికులు సరిగా పదివేలు.

రామరాయలవమానాగ్ని చే దహింపబడినాడు తురక పాలకుల కృతఘ్నతయును, మతాభినివేశమును నతనిరోషములు మండించినవి. కోపాగ్ని చే దందహ్యమానహృదయుం డగు మ యోధులనెల్ల రావించి "విజయనగరవీరులారా! మనకిది పరీక్షాసమయము. ఈనాడు జయించితిమా ఆంధ్రసామ్రా జ్యము గోదావరివఱకును ప్రాకగలదు. లేదా కఱకు తుర కల క్రూర కుఠారముల కెఱ కాగలదు. హిందూమతము తుడుచి పెట్టుకొని పోగలదు. మీరందఱును ఎన్నో యుద్ధ ముల గావించి యుద్ధతంత్రముం దాటి తేఱినవారలు. ఈతురక సైన్యముల నెన్నిమారులో పలాయనము గావించిన వారలు! విజయనగరరాజ్యప్రతిష్ఠకొఱకై మీతండ్రి తాత లెంతటి త్యాగములు గావించియున్నారో మీరంద ఱెఱిగియేయున్నా రలు. వీరరక్తము మీ ప్రతినాళములో ప్రవహించుచుండుట నిజమేయగుచో ఈ తురకసైన్యముల నెల్ల తుత్తుమురు చేయుడు. మేన ప్రాణముండువఱకు మానముకొఱకై పోరా డుడు." అని రోషముతో ఉపన్యసించినాడు. విజయనగర సైన్యములు వీరరసము పొంగి ఉద్రేకముతో ఉఱ్ఱూతలూగి నవి. రక్తముడుకెక్కి ఉత్తేజితులై సింహనాదముల గావించి శత్రువులపై కుఱికిరి ప్రతిసైనికుడును ప్రళయభైరవుడై ప్రతి వీర నిర్మథనమున నిమగ్నుడైనాడు. ఒక్కొక్క సైనికు డొక్కొక్క శత్రువునైన చంపి చావవలెనను దీక్షతో

పోరాడుమన్నాడు. శత్రువులను చుట్టుముట్టిన హిందూ సైన్యము పైరు కోసినట్లు శత్రు శిరములను కోయుచున్నారు. వాతాహతపర్ణములు నేల దుల్లిన విధాన శత్రుమస్తకములు దొల్లసాగినవి. ఇక జయింపలేమని సుల్తానులు భయపడిరి. మంత్రబద్ధభుజంగములవలె రోషఘూర్ణిత హృదయులైరి. హుసేన్ నిజాంషా రోషకషాయితనేత్రుడై - భ్రుకుటిముడిచి-తన సైన్యముల పురికొల్పుచు మరఫిరంగులలో రాగినాణెముల బోసి ప్రేల్ప ననుజ్ఞ యిచ్చెను. ఒక్కొక్క దెబ్బకొక కొంతమంది హిందూసైనికులు గుగ్గిళ్ళవలె రాల మొదలిడిరి. అయినను హిందూసైన్యములు ముసముపెట్టి నఱుకుకొని వచ్చుచునే యున్నవి. ఈ సమయములోనే హిందూ సైన్యములో గగ్గోలు పుట్టినది. సుల్తానుల ప్రోద్బలముచే రాయలసైన్యములో నుండిన తురక సేనాపతులు కొన్ని బలములతో తురకసైన్యముల జేరిరి. తురకసైన్యములో నూతన చైతన్యము బయలుదేరినది. హిందూసైన్యములలో నుత్సాహము చచ్చిపోయినది. ఈ సమయములోనే రామరాయల నొక ఫిరంగిగుండు తాకినది. చాల మంది యోధుల కళ్లే తగిలినవి. హిందూసైన్యములు దిక్కులుచూడ సాగినవి. రామరాయలుగ్రుడై ఉత్తుంగ తురంగము నెక్కి కత్తి ఝుళిపించుచు వైరివీరులపైబడి తఱుగ జొచ్చెను. రామరాయల ప్రళయభైరవాకారమునుజూచి వైరివర్గము లేళ్ళవలె పారిపోజొచ్చినది. క్షతగాత్రుడైన రామరాయల శరీరము నుండి రక్తము ధారలుగట్టి ప్రవహింప దొడగినది. బలము క్షీణించి

పోవుచున్నది. పెల్లుబుకుచున్న మానరోషములు ప్రాణములను కేంద్రీకృత మొనర్చి అంతవఱకైన యుద్ధముచేయుంప గలిగి నది. ద్రోణాచార్యు డస్త్రసన్యాసము గావించినాడు. నిరస్త్రుడయిన రామరాయల కలిసి పట్టుకొన్నారు ఘాతక యోధులు. సరాసరి నిజాంషాకడకు లాగినారు. నిజాంషా కండ్ల మంట లప్పటికిని చల్లారలేదు. రామరాయలు పట్టుపడుట తృప్తి నీయలేదు. తన పగ సాధించుకొనుటకై పండ్లు పటపట కొఱుకుచు, అవహేళనగ చూచుచు ముందునకు వచ్చి "కాఫిర్, కాఫిర్" అని పండ్లు బిగబట్టి నెమ్మదిగ అనుచు "ఇరువదేనేండ్లగ నీ తలయే మమ్ముల వేధించినది" అనుచు నస్త్రసన్యాసము గావించి యసహాయస్థితిలోనున్న అసహాయ శూరుడును-డెబ్బదియేండ్ల వృద్ధుడును - తనతండ్రి వంటి వాడును అయిన రామరాయల తెల్లని పండిన తల పట్టుకొని ఆనాడు ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుని తల తఱిగిన చందాన తఱిగి తృప్తివహించి అప్పటికిని కసితీఱక జెండా కఱ్ఱకు గట్టి ఆకసమున కెత్తించినాడు. వికటాట్టహాసము గావించుచు నూగిపోయినాడు. నలువది సంవత్సరములకుపైగా ఘోరాతి ఘోర సంగ్రామములలో పోరుచు, హిందూసామ్రాజ్యము నకు రక్షకుడై - మహమ్మదీయసుల్తానుల ప్రక్కలో బల్లెమై- రాజనీతి చతురుడైన అళియరామరాయ లస్తమించినాడు. విజయనగరభాను డస్తమించినాడు.

ఆంధ్రసైన్యము లాందోళన చెందినవి. బెదరిపోయి చెల్లాచెదరైనవి. రామరాయల స్థితిచూచి కంపించిపోయినవి.

అనాథములై పారజొచ్చినవి. తురకసైన్యములు వెన్నంటి తఱిమినవి. దారిలోని గ్రామముల నన్నింటిని కొల్లగొట్టినవి. అమాయక హిందువుల నెందఱనో నిర్దాక్షిణ్యముగ విదళించి నవి. కనబడిన స్త్రీలనెల్ల మానభంగము గావించినవి. వచ్చి వచ్చి విజయనగరముపై బడినవి రత్నమయసౌధముల రజము గావించినవి. మహోన్నత దేవాలయముల బ్రద్దలు గొట్టినవి. గజహయశాలల కూల్చివేసినవి. వినోదశాలల నాశనము గావించినవి. ఆరామముల నేలమట్టము గావించినవి ఉన్నత విగ్రహముల వికృతము గావించినవి. ఇట్లారు మాసాలపాటు విజయనగరమును ధ్వంసము గావించినవి.

కృష్ణనుండి కన్యాకుమారి వఱకు విస్తరించి ఏకచ్ఛత్రాధిపత్యము వహించిన విజయనగరసామ్రాజ్య మంతరించి నది. కవిత్వమునకును, శిల్పమునకును-సంగీతమునకును, తదితర కళలకును-ఆలవాలమై వెలసిన విజయనగరసామ్రాజ్యము నామమాత్రావశిష్ట మైనది. రత్నరాసులకును, మణిగణముల కును-వెండిబంగారములకును, వినోదవస్తువులకును-నిలయమైన విజయనగరసామ్రాజ్యము పంచబంగాళమైపోయినది. విజయ నగరాంధ్రసామ్రాజ్యము విస్మృతసామ్రాజ్యమై పోయినది.

శ్రీ కొండపల్లి వీరవెంకయ్య ముద్రాక్షరశాల, రాజమండ్రి.